శ్రీరస్తు.

శ్రీసుబ్బరాయపద్యంబులను

# మానవధర్మప్రదీపిక.

రెండవసంపుటము.

---

ఇందున

సుమతిపద్యములను-యచలమార్గమునుగలిపి

లోకహితార్థంబుగ బ్రాహ్మణశాక నివాసుండగు

పోకూరు సుబ్బరాయునిచే

రచియింపబడి

పండితులచే సరిజూపించి,

ముముక్షు జనాహ్లాదకరంబగునటుల

తియ్యబిండి మల్లయ్యగారున్ను మరికొందరియొక్క

ద్రవ్యసహాయంబున

---

కావలి

ఎద్వర్డ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

---

1912.

శ్రీ

# విజ్ఞప్తి.

---

శ్రీమద్వేదాంత సారులును, మహాయోగపురుషులును, భావాతీతులును, విశ్వబ్రహ్మవంశోద్భవులును, సువర్ణసగోత్రస్తులును హనుమునిగిరి నివాసకులునగు చెరుకూరి శివరామ బ్రహ్మేంద్రయచలగురుస్వాములు మదీయజన్మ సాఫల్యతనుగురించి శ్రీరాజయోగముపదేశించి కొన్నిదినంబుల కనుభవజ్ఞానమును పరిశీలించి కవిత్వశిద్ధిగలుగ నభయంబొసంగె, నంతకొందరు మిత్రులభిలషింప నేను గురుతారావళియును, మైరావణనాటకంబును, వృమమహేశ్వర శతకంబును, త్రిపురాసుర వధయును, సుమతిపద్యములను, యచలమార్గంబును, సుందరాకాండంబును, వచనరీతి లఘువైద్యశాస్త్రంబును, రచియించినాడ. ధనములేమిచే కొందరి సహాయంబువలన 1910 సంవత్సరంబున రచియించిన సుబ్బరాయపద్యంబులను మానవధర్మప్రదీపికలో రెండవసంపుటమునందు ఇహాపర ధర్మంబులుండుటంజేసి ఈగ్రంథంబును, ఇందునసే సుమతిపద్యములను, యచలమార్గంబును, జేర్చి ముద్రింపించడమైనది.

యిట్లార్యజన విధేయుడు.

బ్రాహ్మణక్రాకలో

పోకూరు సుబ్బరాయుడు.

శ్రీ

షష్ఠ్యాది సీసము.

---

శ్రీవసుంధరనును శ్రేయుండు భద్రాశ్వసంబనియెడి గోత్రసంభవుండు। ప్రవిమలుండును విశ్వబ్రహ్మవంశుండును శివరామ నామంబుచేత ప్రబలు। సత్పాత్రుండాతని సతిజోన్నమాంబయా నమ్మిథునంబున కవతిరించె। మల్లయాచార్యుండు మహదయిశ్వర్యుండు మహితమానసుడు సన్మార్గధనుడు। కదర్ప సుందరాకారుండు సజ్జనామోదుండు ననుగాంచి మోదమలర। కృతినిరయుక్కటిజెప్పి కీర్తినొందుమటంచు పలుకరింపమనంబు బరమహర్ష। మొందిగురుడు దెల్పును ముఖ్యాంశములుకొన్ని। శ్రీనాశిసుబ్బరాయ స్వామివారి। కర్పణంబుజేతు నబలుండ గ్రంథంబు। నాదరింపవలయు నార్యులార.

ఇట్లు సుజనవిధేయుడు,

పోకూరు సుబ్బరాయుడు.





శ్రీరామజయం.

శుభమస్తు.

## శ్రీ సుబ్బరాయపద్యములను

# మానవధర్మప్రదీపిక.

## మొదటిభాగము.

---

శ్రీరాజాముసోఁధవుకు శ్రీలలరారుచుకోర్కె దీరఁగన్ ।
నేగమురాసిసన్నుత నవీనసుధాంశ త్రినేత్రధారుఁడై ।
నాగరికంబులేమివడి నాశ్రయుఁడైన సుభూషణాకృతిన్ ।
యోగివెలుంగుఁడైనము మదీప్సితవ్రాతముదీర్పవేడుమన్ ॥

ఉ॥ శ్రీలలనాజనార్దనుల జెల్వగుగోత్రజభూతనాధులన్ । చాలఁగ భారతీవిధుల సామజవక్త్రి గురుప్రభోత్తమున్ । మేలగుభక్తి చేఁగొలిచి మేదినిమాయిలువేల్పుమైనయా । వ్యాళకులేంద్రు పేరకృతి వ్రాసిసమర్పణఁజేతుఁబ్రోవఁగన్ ॥ కం॥ కృతిలోపద్యములకు తుద । నతుకుచునే సుబ్బరాయుఁడను నదిమొదలి । క్షితిగలసర్వాఖ్యలున । న్నతినొనరునాది శేషుఁడారసిబ్రోవన్ ॥ సీ॥ వసుధవిశ్వబ్రహ్మ వంశనాగరసోమ దఖిలతేజోవంతుఁడమలమాన । సుందుసజ్జనమ్మునుండు పోకూరు వీరాచార్యుఁడను ఘనుండలరుచుండు । లచ్చమాంబనఁగు సతినికళత్రంబు యమ్మిధునంబునకవతరించి । నట్టి పుత్రత్రయంబతియోగ్యులనవచ్చు నందున మధ్యపుత్రుఁడమలయశుఁడు సుబ్బరాయాహ్వయుండని సొంపుమీరు । మాతృకభిధానమనిన కామాక్షమాంబ । వారలకుమధ్యతనయుండ వరగనన్ను । సుబ్బరాయుండటందురు సుబ్బరాయ ॥ గీ॥ మానువంశగోత్రమరయ భ

ప్రాశ్వేష ! వ్హనెడునాథునుద్యోవినుష్మునీను । పూర్ణకరుణావలన బొడమువంశంబును । నన్ను నేలవలయు పన్న గేంద్ర ॥ గీ॥ పూర్వక వులనెల్ల పూర్ణభ_క్తినలంతు । నిప్పుడున్న వారిగొప్పజేతు । కుకవి గణముపైన గుసునిల్వ దెన్నడు।సుఖము నొసగిబ్రోవు సుబ్బరాయ॥ సీ॥ శ్రీవసుంధరనుప్రసిద్ధిగాభరియింప నేదేవునకుజెల్లు నీకుగాక । బలిసద్మమునునుదోర్బలశ_క్తి నివశింపనేదేవునకుజెల్లు నీకుగాక । ప ద్మనాభునకుతల్పంబౌచు ప్రబలంగ నేదేవునకుజెల్లునీకుగాక । శశి శేఖరునకుభూషణరీతి వెలుగంగ నేదేవునకుజెల్లునీకుగాక । నీవె భూమికాదిదేవుండవునుదీయ । గృహనివాసవేల్పువిహామునందు । నన్నుకరుణజూచి ననవంతంబును । సుఖమొసంగుమయ్య సుబ్బరా య॥ గీ॥ యిష్టదైవసనుతి నిటులగావించిసం । సారసౌఖ్యధర్మవ ముదయమున । కొన్నిబయలుపరతు గురుకృపకడుప్రేమ । నన్నుక రుణనేలు పన్నగేంద్ర.

## గురూపదేశము.

సీ॥ శ్రీగురుప్రభువరాశివరామహానుముని గిరినాసభవనాశపర మకరుణ । చాలనునంసారసౌఖ్యధర్మంబులు నెరిగింపుడనమున్న గిరితనయకు । భవుడుప్రసాదింపబడిన యంశంబులువాచ్యాయనా ధులుప్రాసినగతి । శేషమానింద్రునిచేకొన్నిధర్మముల్ వినియుం దు ప్రకృతికనుసరింప । బడినభాటలవియుబ్రహ్మపదంబందు । పర మనిష్టపరుల పనులుగావు । వాటిదెలిసిపరమపదధర్మములయందు సుఖముగాంచుమనియె సుబ్బరాయ॥ కం॥ గురుడిట్లనెధరలో స్త్రీ పురుషులకన్యోన్యమైత్రి పుత్రార్జనముం । వరసంసారికభూషణ కరమునెన్న కరుణజూడు ఖగరాడ్వైరీ॥ గీ॥ పుత్రుడుద్భవింపభువిపి తృగురుదైవ । ఋణవిముక్తిగలుగు పృథివియందు । పుణ్యలోక పదవిపొడగాంతురందున । వినుమునిమొభుజంగవీరవర్య॥

## పురుషవర్తనము.

సీ॥ పురుషవర్తనయొక్క పోహణనెఱిగింతు పుట్టినపై దేండ్లుభో గముంద । వలెనుపైనవదేండ్లు పట్టుగావిద్యల నభ్యసింపగదగు నం దుమీద । పదివత్సరంబులు పృథివినిశక్షించి ధనమునంపాదింప ద గునుమరియు । పంచవింశతిపైన పత్నిసౌఖ్యంబపేక్షించగవలయు నుయెంచిజూడ । కాంతసుఖమునందు ఘనుడైవండైనను । కామ్య శాస్త్రివిషయక్రమము దెలిసి । యనుభవింపవలయునవెను మహా త్ముండు । సుఖము నొసగుయయ్య సుబ్బరాయ॥ సీ॥ పరస్త్రీనితల్లిగా భావింపవలయును పరధనంబులకాసపడుటదగదు । పరయింటికలి మికేడ్వగరాదు భువిలోనపరులను నిందించపాడిగాదు । పదిమంది యున్ననభకుబోవగరాదు దలపనబద్ధంబు బలుకరాదు । పరకాంత యింటికి పురుషుంపులేనట్టి సమయంబుననుబోవజల్లదెపుడు । త ల్లిదండ్రిగురువృద్ధజనంబులందున । భక్తిమరువరాదుభార్యకాత్మ । గతము దెలియజేయ తికెక్కనిజెప్పె జూడుమన్నుకరుణ సుబ్బ రాయ॥ సీ॥ దుర్మార్గవృత్తులు దొరియంగవలయును జీవహింస నె పుడు జేయదగదు । తలదీయుకార్యంబు లిలజనించినగాని తప్పు సాక్ష్యముబల్కదగదు జూడ । కూడుగుడ్డయు లేక కూలుచున్నను గాని దొంగవృత్తినివీడ దొక్కవలయు । కామంబధికరించి క న్నులగప్పిన జారత్వమునువీడచాలమేలు । అధికధనము దెచ్చి యె దురుబోసినగాని । జూదమాడరాదు సుగుణమతుల । కరయవేశ్య కూట మరువుగాదనిజెప్పె । నిందుసుఖమొసంగు కుండలేంద్ర॥

## పరస్త్రీగమననిషేధవర్ణము.

సీ॥ గుణవంతురాలైన కులవధూటియున్నుండ పొరిగింటిగరితకై దిరుగువాని । పరిచర్యలొనరించు భామినీమణియుండ పరకాంత పాదముల్ బట్టువాని । యిష్టమెల్లనుదీర్చు యిల్లాలుయుండగా

భ్రష్టుసుఖంబుకై భ్రమయువాని । సరసంపుకేళికి స్వగృహంబుం
డగా నతియసహ్యముల పొర్లాడు వాని ॥ యిట్టివానినిభగవంతు
డెట్టుబ్రోచు । పట్టిపడదోయు నరకకూపంబునందు । సృష్టియందు
యనినమ్ముచు సాధువృత్తి । నాచరింపంగదగునని నాదిశేషా ॥

సీ॥ పరభామినులకాసపడిన మానవునకు పరువుప్రతిష్ఠలు దక్క
నుండు । నన్యకాంతనుపొంద నభిలషించంగనే పదిమందిలోబ
లు పలుచదనము । పరసతికూటంబు పాతకంబతిముఖ్య మతిబుద్ధి
చాంచల్య మతిభయంబు । యితరాంగనాసంగంబు నరకదూరము దా
ని నతిజూచినట్లైన ప్రాణహాని ॥ యిల్లాలి నయము యిహ
మున బహుజాస్తి జాతమునగాని సుఖముసున్న । గానజారవృత్తి
కలనైనగమనింప । దగదటంచుబలికె తెలుకేల్ప్రే ॥ గీ॥ యిలలబ
డగు మానవుడిందుమీద । తనమనసంసారసుఖమున కనుగుణవతి
నెనకబోయెడి సమయంబు నెరుగవలయు । ననుమతి నెల్ల కృ
పతోడ ఫణివరేణ్యా ॥

ప్రయాణవిషయము.

ప్రయాణవిషయంబున ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౪-౧౫ యీతిథులున్ను ౨-౪-౬ యీవారములున్ను శుభప్రదము । తూర్పుదిక్కునకు ౨-౭ దక్షిణమునకు ౫ ఆగ్నేయమునకు ౫-౭ నైఋతికి ౨-౬ పశ్చిమమునకు ౧-౬ వాయవ్యదిక్కునకు ౧-౩ ఉత్తరమునకు ౩-౪ యీసాన్యమునకు ౪ యీవారములు శూలలుగావున నయోగ్యంబులు.

తిదిశూలలు—తూర్పునకు ౧-౯ ఆగ్నేయమునకు ౩-౧౧ దక్షిణమునకు ౧౩-౫ నైఋతికి ౪-౧౨ పశ్చిమమునకు ౧౩-౬-౧౪ వాయవ్యమునకు ౧౫-౭ ఉత్తరమునకు ౨-౧౦ యీసాన్యమునకు ౩౦-౮ యీతిథులుశూలలు.

తిథివారశూలలు—ద్వితీయ మంగళవారము, తృతీయ శుక్రవారము, చతుర్థి భానువారము, పంచమి గురువారము, షష్టి శనివారము, సప్తమి సోమవారము, అష్టమి గురువారము, యీరోజులు ప్రయాణాయోగ్యంబులు.

నక్షత్రములు—అశ్వ అనూ హ మూ ధ మృ రే పుష్య శ్ర పున ఈనక్షత్రంబులుత్తమములు. రో ఉ-భా ఉ ఇవి మధ్యమంబులు. తక్కినవి అధమంబులు.

నక్షత్రశూలలు—తూర్పునకు ధని జ్యేలు, దక్షిణమునకు అశ్వి, శ్రలు, పడమరకు రో పుబ్బలును, ఉత్తరమునకు హ ఫల్గుణులును శూలలు.

లగ్నములు—క సిం తు ధ లుత్తమంబులు, మరియు మి కన్య లయందు స్త్రీలకొనుటకును మే తు సిం మ వృ లందు పశువులు కొనుటకున్ను, కటక మీ మ కుం ములయందు ద్రవ్యమార్జించుటకున్ను, సిం ధను మే వృ ములయందు జయముగొనుటయందును ప్రశస్తము.

శూలఘటికా ప్రమాణము.

ఆది శుక్రవారములయందు ౧౫ ఘడియలున్ను, సోమ శని వారములందు ౮ ఘడియలున్ను, మంగళ బుధవారంబుల ౧౨ ఘడియలున్ను, గురువారమున ౨౦ ఘడియలున్ను, దోషకాలం తూర్పునకు పెరుగు, దక్షిణమునకు నూనె, పడమరకు బెల్లము, ఉత్తరమునకు పాలు. దోషఘడియలనంతరము దానమిచ్చిన దోషహరము. తూర్పునకు భోజనానంతరము, దక్షిణమున కస్తమయ సమయంబును, పడమర కర్ధరాత్రంబును, ఉత్తరంబున కుదయంబును, పయనంబు జేసిన శుభస్కరము.

తారాబలము.

గీ॥ జననతారమొదలు జనదగుదినతార । వరకు లెక్కబెట్టవచ్చు

సంఖ్య । బట్టితొమ్మిదింట భాగింపవలెనని। జెప్పెగుపవరుండు సప్ప రాజ ॥ కం॥ సమసంఖ్య శేషమైనఁ । యమితంబై నట్టి సుఖము సం దించును శే । షమునున్నయైనసత్ఫల । క్రమమిాదని జెప్పెగురుడు కద్రువపుత్రా ॥

## చంద్రబలము.

సీ॥ చంద్రబలంబునే శంకరుకృపచేత జెప్పబూనితినింక జను లు మెచ్చ । రాసులంకునజన్మ రాసిమొదల్జేసి పదిపదకొండింట ప ట్టుగాను । యొంటనారింట మూడింట నేడంటను చంద్రుడంటిన మేలు జరుగుచుండు । సరివితో నక్లపక్షమున రెంటను తొమ్మిదిం ట నైదింటంటనంటు శుభము ॥ [illegible] టెనిమిదింటనున్న ఘనమటంచు । [illegible] దివ్యవి గ్రహనన్ను । కరుణనేలుమయ్య భగవరా । గీ॥ [illegible] యు నిలలోనశకునప । [illegible] మంచు దయతోడనిటుబల్కె । [illegible] ॥

## శకునపరీక్షా విషయము.

కం॥ తన కెదుట నెవడు యేది। [illegible] తో నాది । [illegible] నుమని [illegible] సుబ్బ రాయ కారుణ్యనిధీ ॥

ఆదివారఫలము—ఈవారముయొక్క మొదటిజామున ఆగ్నే యము పడమర వినబడుతుమ్ము చెడును కలిగించును - రెండవజా మున ఆగ్నేయము నైఋతి వాయవ్యముల వినబడు తుమ్ము హానిక రము - మూడవజామున దక్షిణ పశ్చిమముల వినబడినమేలు గలు గును - నాల్గవజామున తూర్పు పడమరలవినబడిన మేలునిచ్చును.

సోమవారఫలము—ఈవారముయొక్క మొదటిజామున ఆ

గ్నేయము నైఋతి వాయవ్యదిశల వినబడుతుమ్ము చేటుకరము - రెండవజామున మూలదిశల వినబడుతుమ్ము శుభస్కరము - మూడవజామున ఆగ్నేయపశ్చిమముల వినబడిన శుభకరము - నాల్గవ జామున తూర్పు ఆగ్నేయ నైఋతుల వినబడిన చేటుకలుగును.

మంగళవారఫలము—ఈవారము యొక్క మొదటిజామున పూర్వ పశ్చిమ దక్షిణోత్తరముల వినబడుతుమ్ము మిక్కిలి శ్రేష్ఠము - రెండవజామున తూర్పు ఆగ్నేయము పడమర ఉత్తరం వినబడిన మంచిది - మూడవజామున దక్షిణ పశ్చిమాగ్నేయోత్తరంబుల వినబడిన శ్రేష్ఠము - నాల్గవజామున ఆగ్నేయ నైఋతి వాయవ్యదిశల వినబడిన శుభము.

బుధవారఫలము—ఈవారంబున మొదటిజామున తూర్పు దక్షిణ పశ్చిమముల తుమ్ము వినబడిన మేలునిచ్చును - రెండవజామున నైఋతి వాయవ్య ఈశాన్యంబుల వినబడిన మంచిది - మూడవజామున ఆగ్నేయము నైఋతి యీశాన్యంబుల వినబడిన చేటు - నాల్గవజామున ఆగ్నేయము నైఋతి ఉత్తరముల వినినతుమ్ము శ్రేష్ఠము.

గురువారఫలము—ఈవారమునందు మొదటిజామున నాలుదిక్కుల వినబడుతుమ్ము చేటునిచ్చును - రెండవజామున దక్షిణోత్తర పశ్చిమముల వినబడునది చెడునిచ్చును - మూడవజామున నైఋతి యీశాన్య వాయవ్యంబుల వినినయెడల పోగూడదు - నాల్గవజామున తూర్పు యీశాన్యంబుల చేటు.

శుక్రవారఫలము—ఈవారము మొదటిజామున దక్షిణ యీశాన్య నైఋతి దిశలవినబడుతుమ్ము పనికిరాదు - రెండవజామున తూర్పు ఆగ్నేయము దక్షిణ యీశాన్యంబుల వినబడిన కూడదు- మూడవజామున దక్షిణోత్తర యీశాన్యంబుల శుభకరము - నా

ల్గవజామున ఆగ్నేయ పశ్చిమ యీశాన్యంబుల మేలు.

శనివారఫలము—ఈవారము మొదటిజామున ఆగ్నేయ పశ్చిమ యీశాన్యంబుల వినబడుతుమ్మ కార్యభంగము - రెండవజామున నైఋతిదిశ వినబడిన భంగము - మూడవజామున దక్షిణ పశ్చిమ నైఋతి దిశలచేటు - నాల్గవజామున ఆగ్నేయ దక్షిణాదిశల కీడు.

## గోచారఫలము.

చూచేచోల-అశ్వని, లీలూలేలో-భరణి, ఆఈఉఏ-కృత్తిక, ఓవావీవు-రోహిణి, వేవోకాకి-మృగశిర, కూఘంజఛ్ఛ-ఆరుద్ర, కేకోహాహి-పునర్వసు, హూహేహోడా-పుష్యమి, డీడూడేడో ఆశ్లేష, మామీమూమే-మఖ, మోటాటీటూ-పుబ్బ, టేటోపాపి ఉత్తర, పూషాణాఢ-హస్త, పేపోరారి-చిత్త, రూరేరోత-స్వాతి, తీతూతేతో-విశాఖ, నానీనూనే-అనూరాధ, నోయాయీయూ జ్యేష్ఠ, యేయోబాబి-మూల, బూధాభాఢ-పూర్వాషాఢ, బేబోజాజి-ఉత్తరాషాఢ, జూజేజోగ-అభిజిత్తు, ఖీఖూఖేఖో-శ్రవణం గాగీగూగే-ధనిష్ట, గోసాసీసు-శతభిషం, సేసోదాది-పూర్వాభాద్ర దుశ్చంఝ-ఉత్తరాభాద్ర, దేదోచాచి-రేవతి. గనుక నక్షత్రమునకు నాలుగుపాదములు యిట్టిపాదములు తొమ్మిదైన నొక్క రాశియని తెలుసుకునేది అనగా ఉదాహరణము అశ్వని భరణి కృత్తికాపాదం మేషం, కృత్తికాత్రయః రోహిణి మృగశిరార్థం వృషభం అని యీప్రకారం చూడగా తననక్షత్రం గలరాశి యేది యగుచున్నదో అదిజన్మరాశి అట్టిరాశి మొదలు పండ్రెండు రాసులయందు సూర్యాది నవగ్రహములలో యేగ్రహమేస్థానము యందుండునో ఆయాగ్రహఫలితము ముఖ్యము విచారింపవల

సీ॥ సూర్యుండుకుజుడు మూడారును పదకొండురాసులందుం డిన వాసినిమ। చంద్రుండుమూడొంటు షష్టసప్తములదశమేక ద శముల ఎనరశుభము । సౌమ్యుండుభువిలోన సమరాసులందున్న శుభమిచ్చుచుండును సూటిమీర । గురువైదురెండేడిటరయతో మ్మిది పదకొండెంటనుండిన దండిశుభుడు । కవిరసగిరిరుద్రగజముల నంటగా నశుభకరుండననగునుగడిమి । శనియురాహుకేతు పని బూని దినకర । కుజులుయిచ్చుఫలము గూర్పగలరు । గనుకనిట్లు దెలియ ఘనులంతురనిబల్కె । బహుళసుఖమొసంగుపవనభక్షు ॥

సీ॥ ఒకరాసినెలయుంపు నెప్పగాసూర్యుండు బుధభార్గవులు మరి భూమిజుంపు। నెలమీనెనరియుంపు నిర్జరాచార్యుండు సంవత్సరం బుంపు సరపితోడ । పదిజాములుండును బరువడి చంద్రుండు ము ప్పది నెలలుండు మునిముసశని । రాహుకేతులెలమి రాసులం ది రువడి । నెలలవరకు యుండగలరు యిటుల । దెలిసినడు పవలెను గ్రహములనిబల్కె । కరుణజూడుమయ్య ఖగవరారి ॥

## జంతుశకునములు.

సీ॥ దారిసాగెడువేళ మార్గంబులోదృశ్యములగల ఫలితంబు దె లియవలయు । గరుడభారాద్వాజ గనడేగబుప్పి ముంగిస గుడ్లగూ బలు నపుధమరియు । ఉపుల మించుయు బల్లి యెనపక శునక ములో కుడినుంచి యెడమకు నపునశుభము । నెమలిచిల్కయు మ హిషములు గోవులు నక్కలును కాకులును గాంచనను వుగాను । యెడమదిక్కునుండి కుడికేగినను మేలు అన్నంబు పాల్పెరుగన్ని లంజ । కన్నెగొడుగుచెఱకు కల్లుతేనెద్దుగు । బ్రీముసువాసినీలు సుమఫలములు । యిట్టివస్తుసమితి యెదురైన మేలని । జెప్పెగు రువరుండు నప్పరాజ॥ గీ॥ ఒంటితుమ్ము చేటు నొనరరప్పించును। జం

టకుమ్మమంచినంటజేయు । తుమ్మినగ్గనేని దోషించుశుభమును । గనుమటంచుబలికె ఫణివరేణ్య. కం॥ తలదాకుట యిలగోకుట । బలుచీమట గొణుగు టేడ్వబడుటదరలుటల్ । దలపడితుమ్ముటలివి యును । గలిగినచో కార్యభంగ కరమనెనధిపా. గీ॥ యిటులగని చెప్పుచునుచని యిందుముఖని । శుభదినంబున నీక్షించి శుభకరంబు లైనచిహ్నములనుజూడ బూనవలయు । నవియునెట్లన్న దెల్పెద న నఘణీంద్ర.

బల్లిపాటు.

సీసమాలి॥ పడినెత్తివైరంబు నదిగాకరోగంబు పెకతల భ్రాంతి కలుగడనుకీడు । తలమీద మేనమామల గండమనవచ్చు తలకుముందుగనైతె తనకుకీడు । తలమునుకపైకీడు గలుగుస్త్రీలకు గండమమరు శిఖనువివాహము జలంగు । అటులేక తకీష్ఠమైన వారితో భోగమును కొనవెంట్రుక ప్రమతిముముఖము । ననుబంధుదర్శనంబననగు నటులేక బంధువివాహంబు బడయనగును । ఆదిగా కపోయిన నధికారిమన్ననగలుగు దక్షిణచెక్కు ఘనమునిచ్చు । నాడవారికి కీడు యశమునైనటు యిటుకుడికంట మంచిది యడమ చెడ్డ । ముక్కుపైరోగంబు ముక్కుకొనను ఫీడ ముక్కుక్రిందను హాని ముక్కుకెడమ । శుభము మెష్ఠధనంబు జూడగా కుడిచెవ్వు మేలెడమను హానిచాలగల్గు । కుడికనుబొమ మేలు యెడమను క్రొను వశమిని శుభమిచ్చు నెడమమీన । మాకీర్తి ధనలాభము ను కుడికీడాను క్రిందిపెదవిమీద యింనుభోజ । నము పైనిరాజ భయము గడ్డమున మేలు కంఠమందున కల్మిగలుగు నిజము । మెడను సంతానంబు యెడమను వాహనలాభంబు శస్త్రనాశంబు కుడిని । యడమభుజంబున కడురోగ మొనరించు కుడి జయంబును దె

చ్చు వుడముభోగ। మెడమునందిటనైన కుడినిసోదరులకు గండమా
వడిరొమ్మునగడుసు ఖీడ। యెడమచంటిన లాభమిడు పుత్రశోకంబు
కుడిచంటిపైబడ్డ గూడవలయు। చనుమొనపై మేలు చలగుపొట్ట
నునైతే భాగ్యంబుబొడ్డుపై బాగులేదు। పొత్తికడుపున ప్రాణ
మెత్తునుయట్లు లేకున్న దారిద్రమై చెన్నుమీరు। చతురత నెడ
ము మోచేతిగుటను బడ్డ ధనమెచ్చు కుడి దుఃఖమున జలంగు
ముంజేతులక్ మేలుబొసగించు మణికట్ల కష్టంబుగలుగును ఘన
ముగాను। మీజేత్తులను లాభమిచ్చును యరచెయ్యి నెడము ద
రిద్రహా కుడినమేలు। చేతివేళ్లను మేలుచే కొనగోళ్లన కుడిచే
త జగడంబు నెడముమేలు। పృష్ఠభాగముమేలు బొడములింగము
నందు దారిద్రదశయౌను ధరణిలోన। జానుజంఘలను ప్రయా
ణంబు నూగువులంద రిష్టంబగు లాలితముగ। పాదములప్రయా
ణ పద్ధతిజరుగును। యిట్లుగాలిపాటు నేర్పరించి। ఫలముదెలు
పుమంచు బలికెనుకడుప్రేమ। సుఖముొసంగిబోవు సుబ్బరాయ.

## స్త్రీదేహాభివర్ణనము.

సీ॥ స్త్రీలనిదానంబు జెప్పెదుపాదముల్ పాదుకగతినున్న పతిని
జంపు। కాలికికడవేళ్లు నేలనానకయున్న జారిణియనవచ్చు సహ
జముగను। సడకశబ్దముగల కడుకొద్దిప్రేళ్లది పతికిసుఃఖముదెచ్చు
ప్రబలముగను। పిక్కలందెంట్రుకల్ మిక్కటంబుగనున్న చేటు
భర్తకటంచు జెప్పవచ్చు। తొడలభుజంబుల వడివెంట్రుకలుయు
న్న జారత్వచోరత్వ జాడదెల్పు। పిసుమలముఖము లభగితమా
నుడియున్న బహుళమాస్త్రీనిగా బలుకబడును। మీసంబులున్న
ను దుస్వభావికయగు కంఠంబుకురుచైన కాంతునణచు। మెడని
డివైనను దడయపుట్టింటికి హానిగల్గించును మానితముగ। కను

లు మినకరింతగల దతిజారిణౌ పండ్లు నెడలై్లన పలినిగేరు । నిడు
వు పండ్లైనను కడువడి కలహించు కంఠమందుననుడి కాంతు జం
పు । మెఱుపుపచ్చ నురటవెం డుకలై రెప్ప । లందునెగడ ధరణి
యందు మిగుల। ధనవిహీనురాలు దలపోయనగునని। సుఖమొసం
గుమయ్య సుబ్బరాయ. కం॥ యిటువంటిస్త్రీలనదలుచు । స్ఫుట
తర శుభచిహ్నములను జూపట్టెడుస్త్రీ । ఘటియించునెడ వివా
హము । తటుకునభువియందు జరుపదగునని సుగుణా.

సత్కన్యాలక్షణము.

కం॥ దలపగ జలజసుగంధము । గలమేనితొ నొప్పబడుచు కర
పల్లవముల్ । గలిగిదవళ వస్త్రేచ్ఛయు । గలుగుందివివాహయో
గ్యకరమనినధిపా॥ సీ॥ దేహంబుబంగారు దీప్తితోనున్నను నీలమే
ఘంబుతో నెగడుచున్న । కాళ్లు చేతులు గోళ్లు కనుగొల్కులివి
జూడ నెరుపుతో మృదువుతో బరుగుచున్న । వరముగా కొద్దిని
ద్రాభోజనములతో పలచనౌముఖ గర్భములతోనున్న । మధుక
రంబుల దర్పమణగించు కురులతోమిగుల శీలముతోటిమెలగు
చున్న । శంఖచక్రాదిరేఖలు చరణకరము । లందుగనిపట్టు చుండె
డు కుందరదన । లందుభ్రమనొంది సంసారమందుమిగుల । దక్ష
తనుంచదగునని తక్షకవర. సీ॥ పూర్ణచంద్రుహసించు మోమును
ను బాడినములనెన్ను వాలుగన్నులనుయడ్డ । ములమాపు జేయు
చెక్కులను శ్రీకాగంబు బరిహరించెటి కర్ణవైఖరియును । తిలప్ర
ప్రసారును బొలుపార్చు నాసికమును పాటలముదీప్తి నణచుమో
వి । యునుశంఖమును బొరిగొను కంఠమును కీరవర్గంబు నోగా
త్త బడనిపల్కు । లును నిమ్మపండ్ల యవ్వనమొంచు కుచయుగ్మ
మునుసింహముకు సిగ్గుబొడము నడుము। పద్మపత్రము నెన్నబడు

మరుసదనంబు యుసుకదిన్నెల భ్రమియించు పిరుదు। లున్నరా జ హంసలురువడి తలవంచి। నగగుహాళినడగు నడకలున్న। గలిగియున్న స్త్రీని గనివివాహ మ్రియ। త్నము నొనర్పవలయునన ఫణీంద్ర. గీ॥ గొప్పచన్నులు కర్ణముల్ కోలముఖము। కాళ్లుచే తులు రోమముల్ కఠినపల్కు। లరుగుజారిన పండ్లుండు గరితల వలి। పెండ్లికినియొప్పదనెను దక్షకరేంద్ర. కం॥ ఈలాటియంశ పుంజము। చాలాగని పరిణయంబు సల్పగవలయున్। యేలాదడవు ముహూర్తపు। చాలుగనుంకనుచుబలికె సాహస్రఫణా.

వివాహవిషయము.

౨-3-౫-౧౧-౧౨ వృత్తమము, ౮-౯ మధ్యమము, యీమా సములయందున్ను, ౧-3-౬-౮-౧౩-౧౨ శుక్లపక్షమున యీతి థులుతప్ప తక్కిన తిథులున్ను, కృష్ణపక్షములో ౨-౫-౭-౮-౯-౧౦ యీతిథులున్ను వివాహమునకు ప్రశస్తము. మూల, అనూ, మృగ, రో, హ, రే, స్వా, మ, ఉత్తరాత్రయము ఈనక్షత్రములు న్ను సో, బు, గు, శు యీవారములున్ను మేలునిచ్చును. వివా హలగ్నమునకు కుజుడు ౮ దోస్థానమునన్ను కుజాష్టమదోషము శుక్రుండారింటనున్న భృగుషట్కదోషము చంద్రుడు ౬, ౮ ౧౨ యీస్థానములనున్న షష్టాష్టమద్వాదశ చంద్రదోషము గను క అట్టిలగ్నములు పనికిరావు వివాహలగ్నమునకు ౭ వస్థానమందు పగ్రహములున్నను జామిత్రదోషమనబడును అట్టిస్థానమందు పూ ర్ణచంద్ర బు, గు, శుక్రులున్నయెడ దోషములేదని కొందరు, ల గ్నమునకు ౧-౪-౭-౧౦-౧౧-౨-౫-౯ యీస్థానముల బుధ గురు శుక్రులున్నయెడ శుభము, 3-౬-౧౧ యీస్థానములందు శ-రా ర-కు-కే వీరలుండిన మేలు, స్త్రీ మూలయందు జనించిన మా

మఘను ఆశ్లేషలో జన్మించిన అత్తను జ్యేష్ఠలో జన్మించిన జ్యే ష్ఠభ్రాతను విశాఖలో జన్మించిన మరదికిని హానికరము జేయును
క॥ దలపనీలాటివిషయముల్ దెలిసిభువిని । శుభముహూర్తంబు గనిపించి సుందరాంగి । మైనస్త్రీని వివాహంబు తానిచేత । నొందనగునంచుబల్కె ఫణీంద్రఘనత. చం॥ ఇటులవివాహమంది విభుసింపుజ్వలింపగ మర్లుబెండ్లికిన్ । నటభట బంధువర్గము ఘనంబునదర్లధరిత్రినిన్ గనన్ । స్ఫుటతరశోభనాకృతిని సొంపల రారెడు దివ్యగేహము । కృటి ఘటియింపమేలనియె గాడ్పును సాపడు దేవప్రేమతోన్.

గృహనిర్మాణశంకుస్థాపనము.

శేషార్థము—భక్తాగ్రణీవినుము. శంకుస్థాపమునకు. మాఘ, ఫాల్గుణ, వైశాఖ, మార్గశిర, కార్తిక, శ్రావణమాసములు శ్రేష్ఠములు. ఆదివారము గృహారంభము అరిష్టము, అగ్నిభయము. సోమవారము కలహము. మంగళవారము సంతానకష్టము. బుధ, గురు, శుక్రవారములు శ్రేష్ఠములు. హ, అశ్వ, శ్ర, ధ, రే, ఉత్తరాత్రయము. రో, చి, అనూ, పున, పు, మృ. యీనక్షత్రములు శంకుస్థాపనకు శ్రేష్ఠములు. 3-6-12 యీలగ్నస్థానముల యందు పాపగ్రహములున్న, లగ్నమునకు. 1-4-5-7-9-10 యీస్థానములయందు శుభగ్రహంబులుండిన మంచిగలుగును. పాపగ్రహంబులు 8 వ స్థానమందున్నయెడల కర్తనుచశింపజేయును.

గృహప్రవేశము.

గృహప్రవేశమునకు, హ, పు, పున, శ, స్వా, రే, రో, ఉత్తరాత్రయము. అనూ, శ్ర, మృ, మూ, ధ, అశ్వ, యీనక్షత్రములున్న. కన్య, కుంభ, వృష, వృశ్చి, సింహ, మిథునములలోనున్న. గురు, శని, బుధ, సోమ, శుక్ర, వారములున్న, శ్రేష్ఠతమములు.

## ద్వారబంధవిషయము.

నక్షత్రములలో, రో, మృ ఉ, పు, పున, హస్త, చి, స్వా, అనూ, జ్యే, శ్ర, ధ, రే, అశ్వ, యీనక్షత్రములున్ను. వృషభ, సిం, వృశ్చి, కుంభ, తులాలగ్నములున్ను. లగ్నమునకు, ౧-౪-౫ ౭-౯-౧౦ యీస్థానములందు బుధ గురు శుక్రులున్ను, ౩-౬-౧౧ స్థానముల పాపగ్రహములున్ను మూఢములు లేకయున్న సమయములయందు ద్వారబంధస్థాపనము చేయవలెను. మి, కన్య, ధ, మీనలగ్నములయందు తలుపుమెత్తవలెను.

## పంచకరహితము.

నిశ్చయించిన లగ్నసమయమునకు శుద్ధపాడ్యమి మొదలు ఆరోజు తిథివరకున్ను ఆదివారము మొదలు ఆవారమువరకున్ను అశ్విని మొదలు ఆనక్షత్రమువరకున్ను మేషము మొదలు ఆలగ్నమువరకున్ను లెక్కించి ఆమొత్తమును తొమ్మిదింట భాగింపగా ౧ మిగిలిన మృత్యువు ౨ మిగిలిన వహ్ని ౪ మిగిలిన రాజపంచకం ౬ మిగిలిన చోరపంచకం ౮ మిగిలిన వసుపంచకం యీపంచకములు కూడవు తక్కిన ౩-౫-౭-౯ యివి యనుకూలము.

## నూతనవధూగృహప్రవేశము.

నక్షత్రములలో రే, అశ్వ, శ్ర, ధ, రో, మృ, హ, చిత్త, స్వా, మూ, మ, ఉత్తరాత్రయము పు, అనూ, యీనక్షత్రములయందును తిథులలో ౮-౯-౧౪ యీతిథులుగాక తక్కిన తిథులయందును వారములలో సో, బు, గు, శు, శని వారములయందును నూతనవధూగృహప్రవేశము ముఖ్యము.

## కూపారంభము.

భావి తనయింటికి యీశాన్యము తూర్పు పడమర వృత్తరము

భర్తృణం । బొసర్పవలయుననుచు చర్చరవినబల్కె । సుఖము నొప్ప గుమయ్య. సుబ్బరాయ. సీ॥ యెవరైనపురుషుండు యెదురేగి భాషింప తలయెత్తిమాట్లాడ దగదుజూడ । వరకాంతలతోఁ పొందు వతియొనర్చినగాని గికురింపజెల్లదు ప్రకటితముగ । చవతిపైకలహంబు సాగింపనొల్లదు పతికే.మమునుగోర వలయుఘనత । పతిజయంబును గోర్చి భామినిదైవప్రార్థన నీమనిష్ఠలదనియవలయు । పతి యనుజనలన బరువడిసతిథియ । భ్యాగతులకు దానప్రచయముల ను । యిప్పనగునటంచు విబుధులువినబల్కె । సుఖమొసంగిబ్రోవ్రు సుబ్బరాయ. కం॥ ఇవ్విధమునకుటిలాలక । జన్మమున జరుపుటకును చాలనిశితుఁడ్ । యివ్వసుధగరపనగురుతు । సవ్వడినెరుంతుననియె నావిగ్రష రా.

స్త్రీలజున్మవిషయము.

సీ॥ సతిరజస్వలనెన్న చైత్రముపతినొంచు వైశాఖమందైన వచ్చుకలిమి । జ్యేష్ఠమందైనను క్షితిపుత్రలాభంబు యాషాఢము ధరించౌనుదలప । శ్రావణంబున పెక్కు సౌభాగ్యమొసగూడు భాద్రపదంబున బహుసుఖము । ఆశ్వయుజంబున నధము రాలై మొప్పు కార్తికంబున కోపకాంతయగును । మార్గశీర్షంబున మానితానంబు పుష్యమాసంబైన పుత్రవతియు । దలపమాఘమైన ద్రవ్యంబుచేకూరు । ఫాల్గుణంబునందు బహుయుభాగ్య । నార్తి జలకు నాయునధికమానిబల్కె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ పాడ్యమినాడైన పాపిష్టవర్తించు విధియభాగ్యశాలి షష్ఠినొప్పు । తదియపుత్రసమృద్ధి దలపోయుచవితిని పరపురుషుల గోరు గరితయగును । పంచమిసుగుణముల్ ప్రాప్తించుచుండును షష్ఠికలహాకారి సాహసమతి । సప్తమియున్నదైన సంతానవతియగు

నష్టమాయెంగదైన నమ్మకతనము । నవమిని గఖంబు ననభోజనికిని దెప్పు
దశమిపుత్రుల చేత దనియుచుండు । సుభము యేకాదశి సూచింపు
చుండును ద్వాదశి పగలతో తగవు దెప్పు । అంచవతియు త్రయోదశ
యు చతుర్దశి । పౌర్ణమి భవగణంబు పూర్ణిమపర । యింటివా
సమొప్పు నడుములమావాస్య । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

సీ॥ ఆదివారంబున బుఖ్యుడయనా వ్యాధియు సోమునిదినమందు
భామసుగిణి । కుజవాసరంబున కోమలి వైధవ్య మొందుబుధునిదినం
బు పుత్రకలి । గురువాసరంబున గాధన ప్రాప్తియు దైన్యకుగుది
నంబు దైవభక్తి । దగ శనివారంబు దివ్యముగాబులుకట్ట నశనరిగ్రముచే
త ధరణినుర్వు । నాగనాలుగాదు పదిరెండు పదికొండు । యేను గూ
డటంచు నెన్నబడదు । లగ్నములు శుభంబులెంచంగానగు । సుఖ
మొసంగిరావు సుబ్బరాయ. సీ॥ నాటిబుధాఫలంబు నక్షత్రము
లవెన్న నశ్వని మృగశిర హస్తచిత్త । స్వాతి విశాఖ రేవతియు గూడి
పుష్యమి శ్రవణమనూరాధ శతభిషంబు । నుత్తరాత్రయముగూడ పు
ర్వాషాఢ రోహిణులు సమస్తైన హితమునిచ్చు । నాయపూర్వాత్రి
యమూలార్ద్రలాశ్లేష జ్యేష్ఠకృత్తికలందు చెడుగు గూడు । నెల
లోను పదిరెండు నెలలోను సుఖమను పదినెలల్ భరణికి పదునొక
ట్టి కాలమందు నిజేచ్ఛబడునెలల్ । పతులు సతులు జూడ బాడిగా
దు । యంగనపైని మేతమునవచ్చుంటంచు । ప్రబోధనమున బల్కె
బన్నగేంద్ర ॥ సీ॥ సూర్యోదయమునుంచి సూర్యోదయమునకు
కాలమునల్పదియారాను కాలమునకు । నారేసిఘటియ శానాది కాలస
ముత్త శుభము రెంటను యాత్రనూటిపలచు । మూడింటపుత్రు
లు జూడగానాల్గింట దొంగదాయైదింట దొడ్డపుత్రు । లారింట
జారకీర్తాయువు నేడింట ననిమిది వైధవ్య మొనరులొమ్మిదింట

బులయందు నపేక్షదేహముష్ణత్వమున । త్ఫలమభిమానవిహీనము। గలస్త్రీని పిశాచసత్వక్రమమనెనధిపా. సీ॥ చపలంపుచూపులు చంచలహృదయంబు మాంసమందిచ్ఛవాయసమునకును । చపల దృష్టియు నఖక్షతదంతక్షతములు అరవడంబుండు వానరమునకును । ప్రియవాక్యములచేత ప్రియునెంచునదిగాను గార్ధభసత్వంబు గణుకెక్క । కుచములుపిరుదులు గొప్పకూరిదపుగూపు గలది కూర్మంబుగా దెలియదగును । తిప్పటయుజాస్తి యవివేకమొప్పచుండు । భ్రాంతిమిక్కుటమౌను గన్పట్టుసుదతి । పర్యటనసత్వయను పేరు ప్రబలునంచు । దెలియబల్కెను ఘనవ్యాళకులమృగాంక. గీ॥ యిట్లుసాముద్రికాపులందెన్నబడిన । చిహ్నధర్మములనుగాంచి కన్నెయతిప । విత్రమైనదియనిదోచవేడ్కమీరు । పెండ్లియాడంగదగునని బిలనివాస. సీ॥ పతివ్రతధర్మంబు పాలింపబడుస్త్రీని హీనున్తైలతనయగా నెన్నబడును । సద్గుణంబులుగలసతి యె వ్వరైనను కదలికూతురటంచు గణుకెక్క । సుజ్ఞానమతియైన సుందరాంగినిజూడ పరమేష్ఠిసతిసాటి బలుకవచ్చు । నవగుణంబులులేక నతియోర్పుగలకాంత శీతతల్లికిమారు చెన్నుమీరు । నిట్టిసుగుణశీలు లెవనికిదగుచుండు । రతనిగృహమునందు నాటపట్టుగానుతమ్మియింటి గరితయున్నదటంచు । జెప్పవచ్చునవియె క్షితిఫణీంద్ర. సీ॥ పతులుమర్తలైన నతికురూపులునైన పరగోష్ఠినొల్లక బరగుస్త్రీలు । క్షితిబీదవారైన నితరచింతనలేక భిక్షమెత్తుకవచ్చి బెట్టుస్త్రీలు । బధిరాంధకాదులు పతులౌచునొప్పిన దైవరూపులటంచు దలచుస్త్రీలు । చవతిసంఘంబుల జతిజేసినను గాని భక్తిని పోషింప బడనిస్త్రీలు । తల్లులుగనెంచి కీర్తింపదగిన వారు । నరకప్రాప్తికి పందవ్వనట్టివారు । పూర్ణమైనట్టి పదవిని

పొందువారు । వారలతోసాటి లేరని బలికెనధిపా।

## ఆశ్రమధర్మము.

సీ॥ మానవుండగువాడు మహిఁ జేయఁదగు వేద విహితకర్మంబు లన్ వినుముశిష్య । యర్కోదయము మొదలష్టమముకలోన షట్కర్మసత్క్రియ లన్నల్పవలయు । పండితులేర్పర్చబడినవర్ణాశ్రమ పద్ధతులను వీడబుద్ధిగాదు । ఘనవుషకాలంబు నను లేచితప్పక స్నానంబుజేయంగ జనుధరిత్రి । సంధ్యవార్చనట్టి జనుడెవండైనను। ఎట్టికర్మజేయ నట్టికర్మ । ఫలమునీకఘోర పాతకంబంటించు । ననుచుబల్కెనయ్య ఫణికులేంద్ర. సీ॥ అంకుమీఁదట దేవతార్చనమొనరించి శుభకరద్రవ్యముల్ జూడవలయు । పూర్వాహ్ణమపరాహ్ణముల దేవపితృకార్యములు సల్పందగు విమలముగను । తలిదండ్రి గురుభార్యతనయులు దీనులు యభ్యాగతుండగ్ని యథితులందు। శ్రద్ధచేపోషింప జనుజ్ఞాతినిర్ బంధువునునిర్ధనుని యనాథనుధనీకు । డైనవాడు భువినిత్రాణచేపోషింప । వలయునైనవారు వచ్చినపుడు । దానుతినెసియన్నమైనను పంచిచ్చి । శేషమును భుజింపజెప్పెనభవ. సీ॥ కనికరంబోర్పు త్యాగముశ్రద్ధ ఇంద్రియజయముకూడనిపనుల్ జేయకయును । పరవుపకార మేధరిణిపిదగియుండవలెతనగుణము లేపసలగుణము । లనిదలంచరాదగు జనుడొకనికి జేయదగుకష్టసుఖములే తనకుచుట్టు ననియెరుంగందగు గనసత్యవర్తన మందధికారిగా నగుపడవలె । రాత్రికాలంబున నమరానుప్రథమచాతుర్ధ యామంబులువ్యర్థపడక । భగవద్దైక్యమైన పనులు సాగింపుచు । మధ్యకాలమందు మనుజులంత । నిద్రజెందనగును భద్రంబుగానని । బలికెగురువరుండు పవనభుక్కు. సీ॥ మనుజుండు భూమిలోనను దానమొనరింప సత్పాత్రనుగని సల్పవల

యు॥ నాచార్యలక్షణం బమరినవానికి జేయుదానఫలంబు జెప్పవ
శమె । తల్లిదండ్రులు లేని దౌర్భాగ్యవరుడు పసయునవి వాహోదిన
యతరమగు । ఖర్మలుజరిగించు ఘనునకుఫలితంబు జెప్పుటకొకనికి
శక్యమగునె ప్రతికూలమైనట్టి భార్యగల్గినవాని దుఃఖచింతని జ
ప్పదోచబడదు । ఎంచిజూడజూడ నిద్దగుభార్యలు । గలుగువాని
యవిధికమలభవుని । తాతతాతమైన దలపోయజాలడు దెలియు
మనుచుబలికె దివ్యచరిత. సీసమాల. ఆలుమగనిమీద జాలిగా
స్వాధీనురాలుగా నాపేక్షచాలియుండ । తండ్రికన్నను ప్రేమ తరు
ణియందుంచుచు నిష్ఠార్ధసమితిచెందింపవలయు। కంటికిరెప్పకు జం
టబాయనిభంగిస్త్రీమనం బరిరక్షింపవలయు । దేహమశక్తమై
తే । డగినౌషధసేవజేయుచుబాగు జేయవలయు । స్త్రీవధూవ
రరూపలావణ్యములు యవ్వనము సమానంబుగా నమరవలయు ।
ఆటలన్ పాటలన్ మాటలన్ వేటలన్ వనవిహారంబుల దనియవ
లయు । వీణాదిగానముల్ వివిధచిత్తరువులు వ్రాయుటచదువుట
ల్వదగవలయు । ఆలింగనముచుంబనాది బాంహ్యారతంబు ప్రేమ
నొనర్చి మెప్పించవలయు । నిటులగావింపుచున్నను ఇంతిమిగుల ।
మకులుజనియించి పతినిపమరకనుండు । నందుసత్పుత్రధనమబ్బున
నుచుజెప్పె । నిర్మలాకార సాధుమష్కర్మదూర. సీ॥ ఆడవా
రినిభూమి నగడుజేయగరాదు వారలతోఁగల్గ బడియెలోక । స
ముదాయమెల్లను సర్వజ్ఞులైనట్టి బ్రహ్మవిష్ణుమహేశ్వ రాదులం
త । నెత్తిబెట్టుకగొల్వ నేర్చునదిగాక నిష్టకామ్యార్థలంబు లి
వ్వగలరు । కలకంఠులెంతైన కన్నీరుబెట్టిన శిరిఇంటనిల్వదు సిద్ధ
మిదియు । ఎంచిజూడస్త్రీలకే దోషములులేవు । పుణ్యమతుల
టంచు బుద్ధిదెలిశి । ఏలుచున్నచాల మేలుగాంచుమరని । జెప్పె

గురువరుండు శ్రీకరఘనా. సీ॥ స్త్రీలయందునుపేక్ష జేయుచుం
డగరాదు జేసినయట్టిస్త్రీ చెడునుపుడమి । అత్తమామలు బావలన్న
లు తలిదండ్రులమాపు లేకను ఇంటికధిపతైన। ఎప్పుడుపుట్టిల్లు నెప
బాయకున్నను పొరిగింటివారిగా బరుగుచున్న । జారిణిస్త్రీలతో
సహవాసమొనరించు పరపురుషవిశేష భాషలున్న । గమనుతగుపు
కెపుడు రాడీయుచున్నను । ఇంటిసొత్తు దొంగిలించుచున్న । ని
ట్టివారిమతము నెప్పైనబోదోల । వలయునను చుబలికె వాసు
కేంద్ర. సీ॥ ఇతరస్త్రీలను నరుండీక్షించినప్పుడు తనతల్లిమాసు
గా దలచవలయు । పరసతి చిత్రితాభరణురాలైయుండ పసిమ
శ్వరిగి ఎంచవలయు మదిని । పరకాంతబిలుపింప వచ్చుచున్న సమయం
బు గనిపోయిమల్లాది ఘనమటండ్రు । పరిపఘూవములను పొంవ్రత
స్వులుగా భావింపకయుసేలు బరగుమంచు । నిజలన ర్తింపు
మానవుండిహములోన । పూజ్యతము నొంది పరమందుభూరిసౌఖ్య
పరుమయగుసంచుబలికెను కరుణకలిగి । నన్ను నేలంగవలయును
పన్నగేంద్ర. సీ॥ పుత్రధనమునకును పోలినవస్తువు । గానబడదు
ధరణిలోననెంచ । సిడియుగాక ముదితలిచ్చు సౌఖ్యమువంటి
సౌఖ్యమొసగరనెను సర్పరాజ. వ॥ అట్లుగావున సీ॥ పతి
వ్రతయైనట్టి సతియొప్పనగు వాసుజాడ్యదూసంచేను జగతియందు
నదియెట్టులనియన్న నధరామృతము పానమందు పైత్యహరంబు నం
దుమీద । నాలింగనలచేత నమరువాతహరంబు సురతమందున శ్లే
ష్మ హారముమరియు । బాలలఘుత్వదీపనశక్తి హర్షంబునాడినై
ష్ఠల్య తనమరజేయు। యవ్వనిపంచేంద్రియములకు బలమును ఘ
నత్రిదోషంబుల నణచుమంచు । పౌష్టికరతంబుదీపన జ్ఞానముల ని
చ్చు వృద్ధురాలిరతంబు శుద్ధతప్పు।గానమ్మట్లు దెలిసి మానవులందరు

వారి వారిపతులవారుగలశి । మెలగవలయుననుచు బలికెను చర కగ్రం । థానుసారమిదియు తత్కేంద్ర. కం॥ జనులీవిధినటియిం పుచు । తనభార్యలగూడదగిన తరివినుమంచున్ । ప్రణుతించునటు ల బలికెను । ఘనవ్యాలకులాబ్ధిసోమ కరమర్ధిభువిన్.

## సంభోగసమయవర్ణనము.

సీ॥ పురుషులంమనజూడ భూరిసంభోగేశ్చ జనియించునందుననడ్డ జేయ । నశ్శక్తిరోగంబు నధికచాపల్యంబు మేధస్సువృద్ధియు మేహ జాడ్య । మును దేహశిథిలత్వము నపుంసకత్వము బొసగించునటుపై ని పుత్రభాగ్య । మొనగూడనటుగాన ననబోణులను పెండ్లియాడి మితంబుగాగూడుచుండి । వెంటనేస్నానమొనరించి వేడుకలర । పాలుశర్కరగుడమును భక్ష్యములును । మాంసమునువీటి భక్షింప మంచిదంచు । బాహటములోన గనుమని బలికెనభవ. సీ॥ గ ణుతింపసంభోగమునకర్ధరాత్రి ప్రాతఃకాలమిట్టమధ్యాహ్నసంధ్య । వేళలొల్లవుస్త్రీలకేళిరాత్రిద్వితీయయామంబు హితమగుభూమిలో న । రతియొనర్చినమీద రాత్రియంతయునొద్ద పండుకోగూడ దె ప్పటికైనెన । సతులవసంతాది ఋతువులందునమూడు దినములకొ కతూరి యనువుగ్రీష్మ । ఋతువునందున దినవితముపదేనింటి । కొక్కతూరిస్త్రీని గూడవలయు । ననుచు చెప్పబడెను ఘనులిదివిని మెచ్చ । సుఖము నొసంగవలయు సుబ్బరాయ. సీ॥ ఇష్టంబులేనిది యితరునిప్రేమించి నదియాకలితోడస్సి నదియురోగ । మును జెం దినదికోపమును బొందినదియన్న మప్పుడుదినిన దానన్యకాంత । లనుగూడదగదు మైధునమొనరింపను నదిదేవళంబరణ్యముశ్మశాన వాటికందునపట్టపగలందు లజ్జవలించెడిచోట్ల భోగించరాదు। సతు లు కక్షగశేరి స్థానముం దెముసోజు । వతులుహొందకున్న బహుళహ

త్య । సంభవించుననుచు సరసులువినబల్కె । సుఖము నొసగుము య్య సుబ్బరాయ.

## పరవశత్వము.

సీ॥ స్త్రీకనుకూలుడై జెన్నొందువానికి పదిమందిలోనను ప సువుగలదు । స్త్రీకనుకూలుడై జెన్నొందువానికి ఇహసౌఖ్యసం తతినెన్న వశమె । స్త్రీకనుకూలుడై జెన్నొందువానికి తనయింటి లోలక్ష్మి తాండవమాడు । స్త్రీకనుకూలుడై జెన్నొందువానికి పు త్రభాగ్యముచే పవిత్రతయగు । స్త్రీకియనుకూలుడైనట్టి శ్రేష్ఠున కును । ఇష్టకామ్యార్థములు ఫలియింపజేసి । కేవలానందవార్ధి కీర్తివెలయ నోలలాడించుననిబల్కెవాళిచంద్ర. కం॥ ఇద్దరిమన ములు యొకటై । ఒద్దికతో గలియునప్పుడొప్పెడుసుఖముల్ । యి ద్దరికి బ్రహ్మకైనను । సాధ్యముగాదంచుబలికె సాహాప్రసఫరా. కం॥ క్షితియందు బ్రహ్మసృష్టికి । ప్రతిసృష్టిని జేసెననెడి పద్ధతివినవే। వె తుకగవలె నావేరే । మతిమంతులటంచువల్కె మహనీయనరా.

సీ॥ అట్టిసౌఖ్యముజేసె హరిహరబ్రహ్మలల్ భూరికాంక్షవహిం చి బుట్టునట్లు । నట్టిసౌఖ్యముజేసె నఖిలలోకంబులల్ భూరికాంక్ష వహించి బుట్టునట్లు । నట్టిసౌఖ్యముజేసె నండపిండంబులల్ భూరి కాంక్షవహించిబుట్టునట్లు । నట్టిసౌఖ్యముజేసె నతివలపురుషులల్ భూరికాంక్షవహించిబుట్టునట్లు । నట్టియానందసుఖములో నవతరిం చు । నట్టియానందసుఖములో నను జ్వలించు। నట్టియానందసుఖము లో నడగునంచు । నఖిలమునకాది యదియంచు ననియెనభవ. గీ॥ అదెమహామూల ప్రకృతియదెయనాది । మాయయదెనిహపర ముల మాతృకయదె । యగుజన్మాయ కారిణియంతకన్న । వేఱు లే దంచుబల్కెను విషధరేంద్ర. గీ॥ అదియురెండు విధంబులై యల

రునూర్ధ్వ । యోనియనగను భువినధో యోనియనగ । నవియె బ్ర
హ్మాదులకును వారయ్యలకును । మూలమని జెప్పె భుజగేంద్ర ము
ఖ్యఘనత. సీ॥ అదెయూర్ధ్వకుండలి యిదియధోకుండలి యదియె
త్రికూటంబు యిదిత్రికోణ । మదెబ్రహ్మస్థానమానిదిక ర్మస్థానమా
నది యొసగునుముక్తి యిదియుభుక్తి । నదిపరంబునుజేసె నిది
యిహంబునుజేసె నదియీశ్వరునిజేసె నిదియుజీవు । నదిమోక్ష
కాంతయా నిదిమనోకాంతయా నదిజేసె జ్ఞానమజ్ఞానమదియు ।
నదిస్వచ్ఛగుంటయా నిదియిచ్ఛగుంటయా నదిజేయు నంతపనిది
యుజేసె । నందుసర్వాధికారుల నదియుజేసె । నిందుసర్వాధికారు
ల నిదియుజేసె । నట్టియోనిని నీయోనిబుట్టనయ్యె । నట్టియోనిని
నాయోనియనె ఫణీంద్ర. సీ॥ అదిత్రికూటంబయ్యె నిదిత్రికూ
టంబయ్యె నదిబ్రహ్మస్థానంబు నిదియునదియె । అదిముక్తినిచ్చును
ఇదిముక్తినిచ్చును అదిపరమపదంబు యిదియునదియె । అదియి
హలోకంబు యిదియిహలోకంబు యదిజ్ఞానమజ్ఞాన మిదియునది
యె । అదిమోక్షకంతయానిది మోక్షకంతయా నదిజేయు నం
తపనిదియుజేయు । నదియుప్రకృతియోచింప నిదియుప్రకృతి।యుం
దెపురుషుండు యెంచదీనందె పురుషు। డందెస్త్రీయును యెంచదీ
నందెస్త్రీయు । నెప్పబడునని జెప్పెను సర్పరాజ. సీ॥ మనసధో
యోనినిమరిగి క్రీడించును యూర్ధ్వయోనికిని దృక్కుత్సహించు।
నుమనరతంబు చేసూచించు పదునాల్గు భువనముల్ దృక్రతంబున
ను పరమ। పదము ప్రకాశించబడునట్టి రతిసుఖానంద మెంతని జెప్ప
నగునుచూడ । విశ్వజాలంబులా విశ్వేశులామహదానంద వారిధి
దగిలిమిగుల । యర్లుకొనుచునుండు రాద్యంతమెరుగక । నగులుగ
డుతురన్న నగరెఘనులు । గనుక రతిసుఖంబె ఘనమంచు గురువ

రుం । డమలమతినిబల్కె నాదిశేష. కం॥ కొందరు స్సూర్ధ్వబిలం
బును । కొందరును యధోబిలంబు కోరికదీర్ప । పొందుకొను
చుందురనుచు । వసుంధరలోజెప్పెనయ్య సుబ్రహ్మణ్యా. గీ॥ పర
వశత్వమందు బరిగెదుసుఖజాడ్య । చయమునకును దగినసాధకము
లు । జనులు దెలిసి ధాత్రినను భవించినమేలు । నొందగలరటంచు
నుడివెనధిప.

## ముఖరోగచికిత్సావిషయము.

సీ॥ ముఖవ్యాధులణగించు సురుచిరయోగంబులును దెల్పెద
ను నదిగనుమువత్స । రసములునాల్గు వీరముగంధకము సమంబు
లను టెంకాయలోపలనిమిడ్చి । తేలికపుర మేసి తీసికొబ్బరితోటి
మర్ధించి చనకసమానమాత్ర । సేవించిననుపూర సింధూరముల
రెండు మూడేసివంతుల గూడనిచ్చి । కొంతిరొండొంతులునంటిం
చి తిప్పతీగాకు రసంబునపాకపరచి । మాత్రశనగలంత మాటుకొం
తిసమర్చి । తేనెలోనముంచి దిన్ననుపవ । మేహవ్రణము లణగు
మేదినిలోనని । బల్కెగురువకుండు పన్నగేంద్ర. శేపార్థము॥ ౧
నారిశేఖరసాయనము అదిఆకాయలోని నీళ్లచేతనే నూరి తొమ్మిది
రోజులు తినేది. తియ్యపత్యము. ౨ రసరాజేశ్వరం, ఇదివేరేకొం
తినీళ్లతోనూరి మాటుబెట్టేది పూటకు మూడుమాత్రలపంతున
౫ రోజులు తినేది, ఇచ్ఛాపథ్యము, వెంటనే తాంబూలం వేసేది,
కరక్కాయ నమలేది. సీ॥ మిత్రమశగలకు మేదినివినిపింతు కొన్ని
యోగంబులు కోర్కెలొదవ । రసవర్గములు నాల్గు వసమించు
గంధక చిత్రమూలపుపొట్టు జీలకర్ర । పాల్లుసమంబంనపాది రసం
బున నూరి కుంకుడుగింజ లురువుమాత్ర । జంటలు పదిపూట
లంటించి సమపథ్యముంచ రేవలదిన్ని నంచితముగు। యేలకవాము

మిర్యాలు పిప్పలిరాతినార గంధకమును పారదంబు । భాగసమము
గూర్చి పట్టుమీరగనీళ్ల । నూరిపదిదినాలు కూరుతీపు । చాతదినిన
సర్వశగలడంగునుయనె । సుఖమొసంగిబ్రోవు సుబ్బరాయ. శే
షార్థము॥ ౧ వహ్నిమూలయోగము ఇదిమాత్ర తేనెతో ముంచి
తినవలెను. ౨ ఇదికల్హారయోగము. సీ॥ కోరుకుజాడ్యమునకు
కుంభినివినుపింతు కొన్నియోగంబులు కోర్కెలొదవ । రసపూర
మును మరి రససింధురంబును చక్కలవంగాలు సమముచిత్ర । క
మునాల్గు పాళ్లను క్రమముగమర్ధించి చణకమాత్ర ప్రమాణము
ననుదినః। కోరుకుశగలడంగుమురం. ఇంగిలీకంబు జీడిగింజలగాల్చి శే
షుకలర । పిప్పలిలవంగాలు ప్రియముతో మిరియాలు చూర్ణించి
పైలించగ చూరగల్పి । బేషమొత్తు తేనెతోడను నేతితో । దినిన
కోరుకు జాడ్యమణగుతీపు । పథ్యమునచుదెల్పె పరమవేద్యగురుం
డు । నన్నుబ్రోవవలయు పన్నగేంద్ర. శేషార్థము॥ ౧ చిత్రమూ
లయోగము. ౨ యింగిలీకశింధూరము యేడేసిరోజులు సేవించేది
సీ॥ అంటురోగంబుల కపుషధాలెఱిగింతు నిలనుశంకరుకృప గలు
గునటుల । పసిమికిదెల్పెద పరమలవంగాలు చక్కయేలకనల్ల జీల
కఱ్ఱ । సమముజాపత్రియు జాజికాయలు యర్థభాగంబు చక్కెర
పాళ్లురెండు । గుంటకలగరసమంటునట్లు మధించి చిల్లగింజల
లాగు శీతిపదేను । దినములుసమ పథ్యమునను దిన్నను లవంగాలు
తంగేడు మిర్యాలు యేల । కులులవంగచెక్క గూర్చి నీళ్లతో నూరి
చిల్లగింజలాగుజేసి జనులు । మూడుమూళ్లనాళ్లు వాడుడీ భువియు
న । సుఖముసంగవలయు సుబ్బరాయ. యిచ్ఛాపథ్యము॥సీ॥ నేల
యుసిరిక తెల్లజీలకఱ్ఱ పదేనుదినములు సేవించనగు తెల్పు । మే
అహల్ తోకమిర్యాలు లవంగాలు చక్కెరసమపాళ్లు చల్లతోటి

నూరిపశుముదిన్నసురుతరేలక్కాయ పచ్చకర్పూరంబు పంచదార।
తిప్పసత్తును ప్రేమదెచ్చి చూర్ణముజేసి ఆవువెన్ననుగల్పి దైనపూ
ట। లిడిన తెల్పువ్యాధులడగు పథ్యమునమ। మనివచింతురిలను
మునిజనాళి। నాభవంబుబాపినవరతంబును । సుఖమొసంగుమ
య్య సుబ్బరాయ. సీ॥ రక్తశగలడంగ రాజిల్లనౌషధములుకొన్ని
దెల్పుమసలలితముగ। పటికేలకులు సమపాళ్లు సురాకార ఖరి
యాలు జాపత్రియర్థపాళ్లు। పతిమదాల్చినచెక్క పాత్కభాగము
గూర్చి కలబందరసమున గలియనూరి। అయుసుగోజులొసగి యూ
వుముజ్జిగ పెసరపప్పు లక్ష్మీచారు బచ్చలాకు। పథ్యమౌను సితకప
ప్పతిమధురంబు ద్రాక్షఖర్జూరంబు దాల్చినయును। నాగకేసరి
సోపు భాగసమాశంబు చూర్ణించిచక్కెర జూడసమము। జేర్చిసేవ
జేయు జమ్మియాకులముద్ద। నారుపూటలెలమి నాచరింప। నెరు
పుశగలడంగు సరియైనపథ్యమౌ। సుఖమొసంగుమయ్య సుబ్బ
రాయ. లేహ్యవర్గము. సీ॥ ధరలేహ్యచూర్ణవిదానంబు నెరిగింతు
గనుమంచు బల్కెనిష్కపటధనుడు। కటుఫలత్రయ లవంగపు చె
క్కతాళిశ పత్రిపరంగిజాపత్రి కోష్టు। జాజికాయలు ఖురాసాని
వామును రాస్న వాయులవఁ గాలువామ్ముచతురు। జాతకజిలకరల్
సమముచూర్ణముజేసి అల్లము ఖర్జూరబిల్వపల్పు। ద్రాక్షపరంగి
గంధకచిత్రకము జీడిగంజావిపిల్లి తేగలునుముస్థ। లశ్వగంధియు
నుకూష్మాండంబు గోమమరవ తాటిగడ్డలవివరము విను। వీట నె
క్కొకవస్తువెత్తి పదొంతులుపై చూర్ణమునగల్పి పంచదార।
యట్టిచూర్ణసమాంశ మంటించి యందర్ధభాగంబు గోనెయ్యిపా
క్కతేన। గల్పివంటలేహ్య గణహానునేతిని। తేనద్రోసివంట
మానిరేని। చూర్ణవర్గమగుచు సొంపొప్ప ల్లును। సుఖమొసంగు

మయ్యా సుబ్బరాయ. శేషార్థము. అల్లము మొదలు ౧౫ వస్తువు లలో నేది పదిభాగములు గలియుచున్నదో దానిపేరే చూర్ణము నకుగాని, లేహ్యమునకుగాని, వచ్చుచున్నది. ఉదాహరణము. అల్లముగలసిన ఖండాద్రికమనిన్ని, జీడిగలిసిన భల్లాతకమనిన్ని గంజాయి గలిసిన, కామేస్వరమనిన్ని, పిల్లితేగలుగలిసిన శతావరియ నిన్ని, తాళిశపత్రిగలిసిన తాళిక లేహచూర్ణమనిన్ని యిట్లే అన్నిటికి అన్నిపేర్లు గలిగియుండును. గుగ్గిలమహిసాక్షిగూడా నిట్లే చేర్చవచ్చును. అల్లము, ఖర్జూరము, ద్రాక్ష, తాళిశ, బిల్వాదులు ఉష్ణములను పైత్యములను శాంతిపెట్టును, పరంగి, గంధకము, చిత్రమూలము, జీడి మొదలగునవి సుఖసంబంధ జాడ్యముల నణచును. గుగ్గిల మహిసాక్షి మొదలగునవి వ్రణములను వాతములను పట్టును. గంజావి, పిల్లితెగ, పెన్నేరు, గుమ్మడికాయ, గోదమ ఒన, నేలతాటిగడ్డలు మొదలగునవి వీర్యవృద్ధి, శరీరపుష్టి, ధాతపుష్టి గలిగించును, చూర్ణములకు వస్తువులను వెచ్చబఱవేయించి చూర్ణించేది. లేహ్యములకు వెచ్చజేయనక్కఱలేదు. చూర్ణములలో చక్కెరనుగాని తాటిబెల్లమునుగలిపి చూర్ణమునుగాని లేహ్యమునుగానిరోజుకు తులంవంతు ౧ మండలంరోజులు తినేది యిచ్ఛాపథ్యము స్త్రీకూటముకూడదు.

## పుత్రోత్పత్తి వర్ణనము.

గీ॥ సుఖదశ ర్తవలన జొప్పడువ్యాధుల । నిట్టుగడచిపురుషశ్రేష్ఠులెలమి । ఋతువుతరి నెఱింగి రతమొనర్చుచుపుత్ర । ధనమునందవలయు ననేఘణీంద్ర॥ సీ॥ వినుముపుత్రోత్పత్తి విధమెఱింగింతు స్త్రీశోణితమతిశయంబైన స్త్రీలు। పురుషశుక్రంబతివురువైన పురుషులు గలుగుచుందురటంచు దెలియవలయు । ఋతువాది ప

డునారు రోజులవరకు గర్భమునిల్చుతతియని ప్రబలునందు । ఋ
తువైనతతినాల్గు రోజులు పదకొండు పదమూడురాత్రులు వదలవ
లయు।తక్కినపదిరాత్రు లక్కజంబుగ స్త్రీల గూడిభోగంబందగూ
డునందు । యష్టమిచతుర్దశమమవాస్య పూర్ణిమ । వదలవలయు
గర్భవతికినెలలు । యెనిమిదింటగూడ జనరాదనినచించె । సుఖ
మొసంగవలయు సుబ్బరాయ. సీ॥ పడతుకముట్టైన పదునారురో
జులు గర్భమంకురమొందు కాలమానసమదినంబులలోన కొమరు
లు బేశిరోజులలోన స్త్రీగల్గగలదు మరియు । గ్రహచారమనునది
గలదుధాత్రిపలంప ఖ్యాతఫలంబుగా గానుపించు । నదియెట్టులన్న
ను హరిడశ్శుక్రడంగారకుడు బృహస్పతిపుంసకులుదలంప । శశిభృ
గు రాహువు స్త్రీగ్రహంబులుశని బుధకేతుతెలమి నపుంసకులగు
నిట్టిగ్రహములవలన నిటువంటిపుత్రులు । పుట్టగలరటంచు బెట్టు
గాను । బల్కెగురువరుండు పదపడికడుపేర్మి సుఖమొసంగును
య్య సుబ్బరాయ. సీ॥ మరియుశుక్రుడు దేవగురుడు బ్రాహ్మణు
లౌదు రంగారకుడు రవిరాజులగయ । కుముదబంధుబుధుండు కో
మటుల్ శనిశూద్రుడగు రాహుకేతు చండాలులగును। గానయే
యే గ్రహకాలంబునను శుక్రశోణితంబులుగూడి సుతులుబొడమ
నట్టివృత్తులచేత నలరారుదురుభూమి గనషుమ్మయు ప్రభాకర
స్వరంబు । గలియునపుడు బిందుస్థలనమైననుయొక్క । యనయ
వంబు భిన్నమగుచుశిశువు । పుట్టనగునటంచు బెట్టుగావినబల్కె ।
సుఖమొసంగిబ్రోవు సుబ్బరాయ. సీ॥ సుతుడుగల్గంగనే నతితోటి
కూటంబు చాలించినందున మేలులేదు । మతివిహీనుండౌనుగతి
కి దూరుండౌను రతికిశూరుండౌను పతితుడగును । శుద్ధయా
ఢుండౌను మొద్దుగాడయౌను క్షైనందువలన శక్త్యానుసార ।

యుతముగాగూడుచు సుతసమూహంబును బడయంగవలయును పుడమిలోన । నెవడువ్యక్తిగల్గి యిహపరంబులయందు । నాథువృత్తివలన జలగుచున్న । సుతుని చేతరించు గతిగల్గు ననిబల్కె । సుఖమొసంగవలయు సుబ్బరాయ ॥ గీ॥ ఇవ్విధంబునజరుప నయ్యిందుముఖిని । పుత్రులుద్భవమాతరి పూర్ణశక్తి । చాతిజాతకమాడి సంస్కారములను । సల్పదగునంచుబల్కెను సర్వరాజా.

జననవిషయము.

జననప్రకరణమందు యోచించిచూడగా బహుళచతుర్దశిని ఆరుభాగములుజేసి సమభాగమునందు క్షేమమున్ను, ౨ట తండ్రికి ౩ట తల్లికి, ౪ గింట మేనమామకు, ౫ దింట భ్రాతలకు, ౬ రింట నాశిశువునకు గండములు గనిపించును. అమావాశ్య నారుభాగములు జేయగా మొదటధననష్టము, ౨ ట తల్లికి, ౩ డింట తండ్రికి, ౪ గింట మేనమామకు, ౫ దింట శిశువునకు, గండము, ౬ రింట మంచిగలిగించును. అమావాస్య శుద్ధ ౧-౫-౬-౧౦-౧౧ యీ తిధులు గండముగనుక ౩౦-౫-౧౦ యీతిథులయొక్క అంతమందు ౨ ఘడియలు ౧-౬-౧౧ యీతిథులయొక్క ఆదియందు ౨ ఘడియలు తిధిసంధులుకాబట్టి అందు జననమయ్యెనేని గండములు గలుగును. జ్యేష్ఠ నక్షత్ర ఘడియలను ౧౦ భాగములుజేసిన భాగము ౧కి ౬ ఘడియలుకాబట్టి అందు మొదటిభాగములో పుట్టినయెడల తల్లితల్లికిని, ౨వ భాగమందు తల్లితండ్రికిని, ౩ డింట మేనమామకు, ౪ గింట తల్లికి, ౫ దింట శిశువునకు, ౬ రింట నావంశమునకు, ౭ డింట ఉభయవంశములకు, ౮ దింట భ్రాతలకు ౯ దింట మామకు, ౧౦ దింట అందరికిని గండముగలుగును. మూలానక్షత్రము ౧౨ భాగములుజేయగా ౧ దండ్రి, ౨ తల్లి,

౩ భార్యకు, ౪ అనతో బుట్టువులు, ౫ మామ, ౬ తండ్రితో బుట్టువు ౭ పినతల్లి, పెదతల్లి, ౮ సంపద, ౯ శిశునాశనము, ౧౦ దరిద్రము ౧౧ సంపద, ౧౨ రాజ్యమును పొందుదురనుచున్నారు. మూలా నక్షత్రము మొదటిపాదమునందు బుట్టినేని తండ్రికిని, ౨ డింట తల్లికి, ౩ డింట ధనమునకును, గండము, ౪ గింట శుభము, ఆశ్లే ష మొదటిపాదమున శుభమనియు, ౨ డింట ధనమునకును, ౩ డింట తల్లికి, ౪ గింట తండ్రికి, గండము ॥ పూర్వాషాఢ మొద టిపాదమునకు తండ్రికి, ౨ డింట తల్లికి, ౩ డింట మేనమామకు ౪ గింట శిశువునకు గండము ॥ ఉత్తర ప్రథమపాదమునందు ౩ ఘడియలలోన పుట్టినయెడల ౨ మాసములకు, పుష్యమి ౨ వ పాదమందలి ౬ ఘడియలలో పుట్టినేవి ౩ మాసములకు పూర్వా షాఢ మూడవపాదమందలి ౯ ఘడియలలో పుట్టినయెడల ౮ మా సములకు చిత్త, భరణి, వీటి రెండవపాదమందు ౬ ఘడియలలో పుట్టిన ౬ మాసములకును, హస్త, ౩ వ పాదమందు ౪ ఘడియ లలో పుట్టిన ౯ మాసములకు రేవతి, ౪ వ పాదమందు ౫ ఘడి యలలో పుట్టిన ౧ మాసమునకు పుత్రుడైనయెడల తండ్రికిని, ఆ డ శిశువైన తల్లికిని, గండమని తెలిపెను. కావున తగుశాంతిక ర్మ జరిగించినయెడల దైవవశమున గండములు తొలుగునని మరి యునిట్లనియె.

వృత్తరానక్షత్రమునకు తిలదానము, పుష్యమినక్షత్రమునకు గో దానము, పూర్వాషాఢకు సువర్ణదానము, చిత్తానక్షత్రమునకు వ స్త్రదానము, భరణికి మహిషదానము, హస్త రేవతి నక్షత్రాలకు సువర్ణదానము, ఆశ్లేషకు అశ్వదానము. మఖకు సువర్ణదానము, జ్యేష్ఠకు ధేనుదానము, మూలకు మహిషదానము, అశ్వనికి వస్త్రి

దానము, రేవతికి ఆజ్యదానము, యీప్రకారము దానములిచ్చిరే ని దోషపరిహారమగును. సీ॥ గ్రహదోషనెలవుల గాన్పింతు చంద్రుండు యెనిమిదింటను కుజుండేకిటలర । సూర్యుడైదవయింట శుక్రుడారింటను గురుడు పన్నెండింట నరుణసుతుడు । నొకటింట బుధుడు మూడోయింట రాహువు తొమ్మిదింటనుయుండ దోష మబ్బు । చంద్రసూర్యుల చేత జననీజనకు చేటు తక్కినవారిచే తనకు చేటు । గలుగునను చుదెలిసి ఘనులు శాంతికిదగు । క్రియలొనర్చవలయు ప్రియముమీర । ననుచుజెప్పభువిని జనులిదివినిమెచ్చ । సుఖమొసంగవలయు సుబ్బరాయ.

## నామకరణము.

నామకరణమందు అనూ. పున, మ, ఉత్తరాత్రయము, శ. స్వా. ధ, శ్ర, రో, అశ్వ. మృ, రే, హ, పు, యీనక్షత్రములున్ను ౨-౫-౮-౧౧ యీలగ్నములున్ను, ౮ ౧౨-౬-౪-౧౪-౧౫-౩౦-౯ యీతిథులు తోసియగా మిగిలిన తిథులున్ను, ౨-౪-౫-౬ యీవారములును, నామకరణమందు శుభకరము. లగ్నమునకు యెనిమిదింట శుద్ధియుండదగును.

## అన్నప్రాశనము.

అన్నప్రాశనమందు పురుషులకు ౬-౮ మాసములు, ౫-౭ మాసములును, ౪-౮-౯-౧౪-౧-౬-౧౧-౧౨-౩౦ యీతిథులు గాక తక్కిన తిథులున్ను, ౪-౫-౬ యీవారములందుననున్ను, పున, పు, ధ, మృ, హ, చి, స్వా, రో, శ్ర, శ, రే, అనూ, ఉత్తరాత్రయములందున్ను, పదియవస్థానశుద్ధిన్ని అన్నప్రాశనహితకరములు కర్ణవేధ చెవులుకుట్టుటకు ౧-౭-౮-౧౦-౧౨ మాసములు మంచివి

### క్షౌరమునకు.

క్షౌరకర్తయందు హ. చి. స్వా. వి. పున. పు. శ్ర. ధ. శ. అశ్వ. మృ. యివిఉత్తమము. జ్యేష్ట. రేవతి. యివిమధ్యమములు. ౨-౪ యీవారములు మంచివి. ౧-౬-౧౧-౮-౧౫-౩౦-౪-౯-౧౪ యీ తిథులుదప్ప తక్కినతిథులు మేలు. ఆరోగ్యస్నానము మృతకర్త యాగారంభము కాశ్యాది పుణ్యక్షేత్రములు వివాహమునకు పూర్వదినము కారాగృహవిముక్తి యీసమయములందు క్షౌరని షేధ మక్కరలేదు.

### విద్యాభ్యాసము.

అక్షరాభ్యాసమునకు జూడగా, అయిదవ సంవత్సరంబున, ౧-౫ ౯-౧౪-౮-౬-౩౦ యీతిథులుగాక తక్కిన తిథులున్ను. సూర్యుడు. ౧-౪-౭-౧౦ యీరాసుల నుండునపుడును, మౌఢ్యములు లేక యున్నపుడును, అను. రే. అశ్వ. హ. చి. స్వా. పున. పు. శ్ర. యీనక్షత్రములందును అష్టమశుద్ధిగలిగి యుండినను శుభకరము.

### ఉపనయనము.

ఉపనయన ప్రకారమందు చైత్ర. వైశాఖ. జ్యేష్ట. మాఘ. ఫాల్గున. మాసములనున్ను, ౨-౩-౫-౭-౧౦-౧౨ యీతిథులున్ను. హ. చి. స్వా. రే. పు. మృ. పున. ఉత్తరాత్రయము. శ్ర. ధ. శ. అశ్వ. అనూ. రో. యీనక్షత్రములున్ను. ౪-౫-౬ యీవారము యున్ను. లగ్నమునకు ౧-౪-౫-౭-౯-౧౦ యీస్థానములను శుభ గ్రహములున్ను, ౧౧ వ స్థానములో సూర్య చంద్రులలో నొక రున్నను ౧-౨-౩-౪-౬-౭-౧౧ యీలగ్నములున్ను, అష్టమస్థాన శుద్ధిన్ని గలిగి యున్న నొసగల శుభప్రదము.

### లగ్నకాలఘటికాప్రమాణము.

సీ॥ కరమర్ధి విన్లగ్న కాలఘటిక జెప్పఁదలతు శంకరు కృపకలుగు

నటుల । మేదినిలోపల మీనమేషాలకు నాల్గేసి ఘడియలనంగ బ
రగు । వృషభ కుంభములకు వితము నాల్గున్నర ఘడియ లౌనని
చెప్ప బడిరి ఘనులు । మకరంబు మిథునంబునకు తులాకన్యకు
ఘటికలైదుంబాత్కె నడచుచుండు । కటక సింహావృశ్చికము ధ
నువుల కైదు । పైన నర్ధఘడియ బలుకబడును । గాననిట్లు లగ్న
ఘటికలెరుగ దగు । ననుచు దెలియబలికె నాదిశేష. సీ॥ రాశ్యా
ధి పతుల నేర్పడ ౹ నాయుడును సింహకటకంబులకు దివాకరహి
మాంశు । లగు మేషవృశ్చికాలకు భూమిపుత్రుండు మిధునమాం
గనలకు బుధుడటంద్రు । మీనకార్ముకముల మెలగు దేవగురుండు
తులవృషభంబుల నలరు శుక్రు । డిలను మకరకుంభములకు సూ
ర్యాత్మజు । డధిపతులని బల్కిరార్యజనులు । వడిని లగ్నమునకు
నకటి నాలుగునేడు । పదివ యిల్లు కేంద్ర పద్ధతయ్యె । నైదు
తొమ్మిదియని యనదగు స్థలములు । కోణసంఖ్యలనియె కుంభ
కేంద్ర.

ద్వాదశస్థానఫలము—లగ్నము ఆరోగ్యభావము ౨ వ స్థాన
ము ధనభావము ౩ సోదరభావము ౪ సుఖభావము ౫ పుత్రభావ
ము ౬ శత్రుభావము ౭ భోగము ౮ అరిష్టము ౯ సౌభాగ్యము
౧౦ పుణ్యభావము ౧౧ లాభస్థానము ౧౨ వ్యయస్థానము. గీ॥
సాధుమతులుయిట్లు సత్కర్మలనునల్పి । దైవవశమువలన దగెడు
వ్యాధు । లకును పరిహారోక్తి ప్రకటితంబుగాంచ । మేలటను
చు బలికె మిహిరతేజ.

## లక్షణచికిత్సాక్రమము.

సీ॥ అంగుష్ఠ మూలమందుండాని మణికట్టిదయవ మాత్రమున

నాడియతిశయిల్లు । తర్జని క్రిందవాతము మధ్య పైత్యము శ్లేష్మమనామికై జలగుచుండు । వాతనాడియు కప్పవలె పాముల వలె లావుకమువలె వక్రంబుగాను నడచు । నెమలి హంసయు గుర్వగమవపోలిక పైత్యనాడి చాపల్యమై నడచుచుండు పావురము లకుముకి పరగపిచ్చుకభాతిగ మనమెచ్చి స్థిరముగాను ప్రబలు । నదియు భువిని శ్లేష్మనాడి యానవిబల్కె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ వాతరోగంబును వర్ణింతుకన్నులు నల్లనైస్వరము హీనముగనుండు । మూత్రంబు తెల్లన మలబద్ధకము వళ్లు నల్పునాలుక పగుళ్లరచుచుండు । పైత్యరోగికిమాట బహుభీకరము కన్ను వెరుపు పచ్చనమూత్ర మరయనెరుపు । మలము పచ్చన నెర్పు దెలియజేయును జింహ్వ ఎరుపుగా నలుపుగా నెన్ననగును । శ్లేష్మ రోగిజూడ చతురపుమాట్టలు । కనులు తెలుపు పుశియు గట్టుమూత్ర । మలములనయగాను తెల్పు వర్ణంబగు । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ ద్వందరోగినిజూడ తగుచైనమాటలు మెరుపు పశిమికన్ను వెన్నబడును । భువిమి శ్రేవర్ణమా మూత్రమలంబులు జింహ్వ యావిధమెలక్షించి జూడ । సప్తజ్వరంబులు సవ్వడెరింగింతు వాతజ్వరము నందువడలు నొప్పి । వదనంబునల్పుయా పెదవులు ఏండుతిమ్మిరిగల్లు పడలుగగ్గురపాటుచుట । మలము బద్ధకంబుమరియు విదాహంబు । కోరికలు ఘనంబు కొమరుమిగుల । నిట్లుబుధులు బల్కిరిలనంచు వినుపించె । సుఖమొసంగవలయు సుబ్బరాయ. సీ॥ పైత్యజ్వరంబును బరువడి వర్ణింతు పలుమాటలాడుట బారుటయును । దాహంబు వాంతి సంతాపంబు చమటయు నోరు చేదైయెండు బారుటయును । మూర్ఛగ్లుటయును మూత్రపురీషాలు యెరుపతి నిద్రయా

నొసవ నొరువ । శ్లేష్మ జ్వరంబును జెప్పెదు. దగ్గు త్రికయు నూర్ధ్వ శ్వాసలు గల్గుటయును । రొమ్ముకుతుక నెచ్చు రుచిశూన్యము ముఖంబు । తెల్లబ్బారియుండు తీటదగ్గు । గలిగియుండునంచు ఘనులుబల్కుమరిఖ । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ భూతజ్వరంపు భాటపృథివిలోనెట్లన్న శీతశరీరంబు శిరమురూతు । కల్లమాటలు వల్లిగగ్గర పొడుచుట ఆయాసమాశ్యంబు అధికమైన । అన్నంబుదినుట నృత్యముజేయుటలు తంద్రగలుగుట కోర్కెయుగ్రమగు జ్వరము । వచ్చుట విదిభూతజ్వరమగు సన్నిపాతజ్వరం బెట్లన్న దాహమాట । కంఠలలాట వక్షములందు చమటయు తంద్రమతిభ్రమ తాకుటయును । వడలునెచ్చుటయు సర్వాంగాలు రూకూట శిరము నెచ్చుట కన్నులరుణమాట । గాకున్న పసపుగా గాన్పించుటయు రొమ్ము శూలమూర్ఛయు గల్గుటయును । కల్లమాటలు వల్లి గగ్గరపొడుచుట ఘనదగ్గు ఎక్కిళ్లు గల్గుటయును । సన్నిపాతమునకు చర్యలీగతియని । బలికి సంగ్రహముగ పరమహంస । మునచికిత్స వర్గనుమంచు నిటుదెల్పె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ బరువడి వినుపింతు భైరవిసంజీవి మాత్రల వివరంబు ధాత్రిలోన । పాదాష్టకంబునే పాళముల్ రసగంధకమునాభి త్రికటుకములుటంక । ణము సమభాగముల్ సమకూర్చుచును గుంటకలగరసమున గలియనూరి । గురిగింజలంతేసి యురువుమాత్రలుగట్టి తేనచన్నాలతో దినినవాత । జ్వరమడంచు భేదిజాడును సౌఖ్యంబు । మరిజనించుపథ్యమునందు సౌమ్య । మనిషి బుధజనాళి ప్రణుతించునటులను । సుఖమొసంగిబోవు సుబ్బరాయ ॥ సీ॥ స్వచ్ఛందరసమిందు జప్పెదునేపాళ రసగంధనాభిచిత్రకమరిపన । సమముజిల్లేడు కషముచేత మర్దించి యందులో నే

డోలయంత్రమందు । వండిగుంజంతగా వటుకంబులిచ్చిన వాయు
వులనుదృంచు పాదరసము । ముష్టిత్తుగంధకంబులు గజగజసంఖ్య
త్రై త్రికటుత్రిఫలాలు యేకసంఖ్య । నిమ్మరసమునందు నెమ్మదిమర్దిం
చి గుంజకీతి మిరపగింజచూర్ణ । మునుదినిన వాతములనన్నిటి న
డంచు । సుఖముసంగుమయ్య సుబ్బరాయ ॥ సీ॥ పైత్యాదుల
కు ధాత్రిపైత్యాంతకము వినుమల్ల మమ్లకజీరమందుమీద । ధర
లవంగంబులుతాళీశ లవణముల్ సింధూరముసమంబు సెనగపులు
సు । నిమ్మఫలరసంబు నిమిడించి మర్దించి సేవింపపిత్తముల్ చెం
డు నిజము । భువిరసానందంబు బోధించెదను నాభిపూరలింగంబు
సింధూరత్రికటు । కములు టంకణ లవంగములు సమంబులు జం
బీరరసమున జాములుపది । మర్దించి గుంజంత మాత్రలొసంగ
పైత్యములు వాతముల జీర్ణములడంగు । త్రిఫలటంకణ తాళీశ
త్రికటుకములు । స్థిరలవంగాలు దాల్చినచెక్క సమము । అల్ల
పు రసాననూర పైత్యములడంచు । చుండుననిబల్కె కృపతోడ
కుంటశేంద్ర. సీ॥ ధరజ్వరాదులకును దలప కటుత్రయమును యు
గయుగసంఖ్య కనకబీజ । ములు వహ్నిసంఖ్యయా నిలకడరసగం
ధ నాభేకసంఖ్యగా నమరగూర్చి । జంబీర మల్లరసాలను మర్దించి
సెనగగింజ ప్రమాణముననుదినిన । జ్వరములడంగు దోషగుణం
బున వాముపుట్టు తమలపాకుములక । మొగ్గలు కుంకుమపోకలు
వెల్లుల్లి యింగువవెలిగార మివిసమంబు । జిల్లేడేల్ల రసమువల్ల
నూరియుమాత్ర । సెనగగింజయురువుగను భుజింప । స్త్రీసమం
ధమయిన దోసంబులడగును । సుఖముసంగుమయ్య సుబ్బరాయ.

సీ॥ సన్నిపాతములందు జనసంఘమొనరించు యౌషధక్రియ జె
ప్పెద వనియుందు । విషమునూచిక రసవిధమెఱింగించెద గరళంబు

నాభిభాగములుసమము। ఉమ్మెత్తయాకు రసమ్మునమర్దించి సర్షప
గతి దిన్నసన్నులడగు। మరితాళకరసంబు మణిశిల వెలెగార గంధ
క సమము లింగంబునాభి। గజవహ్నిసంఖ్యలుగాఁగూర్చి చిత్రక
జంబీరమల్ల రసములనూరి। మాషమాత్రమొసగ మహిసన్నిపా
తముల్। కాసపాండుశూల దోషధనరు। వాతహారము పులుసు
వర్జనీయంబని। బలికెగురువరుండు పవనభక్షు. గీ॥ కఫరిపుమణిశిల
యింగిలీకములుసమము। కాకురాకురసమునను గలియనూరి। గుం
జనతు అల్లపురసానగూర్చియొసగి। జూడసన్నుల బరిమార్చు సు
బ్బరాయ. గీ॥ కటుఫలత్రయంబు ఘనలవంగంబులు। పత్రిసు
దాల్చెనాకు పత్రికయును। శాలిశాకుపాకిలోఁ దాటిబెల్లముగల్పి
తినగ వ్యాధిహారము ఫణికులేంద్ర.

శేషార్థము.—సన్నిపాతములకు అల్లపురసాను పాకమున యి
చ్చేది, త్రికటుకమన శొంఠి పిప్పలి మిరియాలు, త్రిఫలమనగా
కరకతాడియుసిరికలు, చాతుర్జాతకమనగా లవంగాలు, యేలకు
లు, ఆకుపత్రి నాగకేసరాలు, లింగమనగా యింగిలీకము, యిది
నిమ్మపండ్ల రసమున నూరను శుద్ధియగును, రసకర్పూరము ౧౦౦
వంకాయలలో పెట్టి పుటకించిన శుద్ధియగును, పాదరసము పసపు
యిటికపొడి కరుధూపము బెల్లము అభ్రకాములు వీటితో మర్దిం
చిన శుద్ధియగును, సవ్వీరము టెంకాయపాలలో ఒకదినమువుండిన
శుద్ధియగును, నాభి గోమూత్రములో 3 దినములు నానవేసిన
శుద్ధియగును, నేపాళము గర్భములుతీసి బట్టపేడలో రెండుజా
ములు పుటకించిన శుద్ధియగును. కం॥ [illegible]
చు। నాగరికతబెనుచుమంచ నందనపుత్రుఁడీ। [illegible]
దవగినను। భాగ్యముగాఁ [illegible]. సీ॥ గానునంత

నులుర్వీఘనమానసములతో సద్ధర్మసత్క్రియ సాధుఫణితి । సత్య
సదాచారసంపన్నులై దైవ గురుపితృఋణముల కొఱతదీర్చ। పుణ్య
ముబ్బనటంచు భూరియిచ్ఛజనించ భగవదాజ్ఞగలుంగ బడనిమొద
ల । సంతానమే లేక చరియించుచున్నను సంతుండెపోనుతుల్ సల్ప
మతులు । గానిమొదలనేమి గావలెసత్పుణ్య । పదము నెట్లుగాంచబ
డును గాంచ । బడుదు రేసిపుణ్య ఫలరహితంబున । మోసమనుచు
బలికె వానుకేంద్ర. గీ॥ పూర్వమేర్పాటునకుయొగ్గి పురుషులంత।
స్త్రీలవలలోన జిక్కుచు సిగ్గులేక । జననమరణాదులనుదోఁయ
సాధ్యపడక । మునుగుచున్నారు గనుమనెభోగిచంద్ర. సీ॥ చె
లులకువసులౌటచే జరామరణము లేడలేనిదుఃఖము బడయగలి
గె । చెలులకువశులౌటచే గర్భనరకము నెడలేనియిడుములు బడ
యగలిగె । చెలులకువశులౌటచే దుర్వివేకము నెడలేని కలుషము
వడయగలిగె । చెలులకువశులౌటచే సర్వబంధక మెడలేని కామం
బువడయగలిగె । కామమనెడుమాయ కడతేరనివ్వదు । గానదా
నియునికి గాముగీము । దానిబట్టిజూడ లేనిపోనిభ్రమ । గనుమ
టంచుబలికె ఫణివరేణ్య. సీ॥ అందునజూడగ నదివట్టిబూటక
మయిన సంగతమనిమదిదలంచు । దుఃఖములకు మేటి తుచ్ఛసుక
స్థాన మతియసహ్యావు కొంపమచ్చుమందు । కలియుగాల దేవత జల
దారిదుర్గంధములదొంతి కడురొచ్చుగలుగుకోన । మురికివారధి
రోగములపుట్ట చింతలతోఁటట దొమ్మరిడోలుతోలుతిత్తి । ము
ట్టుపెంకెనుదానికి మురియుచుండి । జ్ఞానపదమైన బ్రహ్మముగ
గానలేక । భూరినరకాబ్ధిలోబడి బొరలువారి । సడవడేముందునని
బల్కె నాదిశేష. సీ॥ వినుమిట్టిధర్మముల్ గనినసేకము కామ్య
పురుషార్థమందున బరగుచుండ । నవియెల్ల స్వర్గలోకాదులగలిగించు

సంపుమీఁదట దించుక్రిందికవియు। నిట్లుబొందుచు జీవులెడలేని పరిపాట్లు బడుచునుందురటంచు బలికిమరియు। చావుపుట్టుకలేని సంతత సౌఖ్యంబు నొందుమార్గముగాంచ రిందువలన। నట్టిపద మునందు టరుదుజనంబులు। జన్మమంచిదైన సత్వమతిని। పొం దనగును పరమపురుషార్థమనిబల్కె। సుఖమొసంగుమయ్య సుబ్బ రాయ.

## మోక్షమార్గవర్ణనము.

సీ॥ పరమపదంబైన బ్రహ్మస్వరూపంబు గురుడుబోధింపక గు రుతువడునె। మతభేదములు లేని మహనీయరూపంబు గురుడుబో ధింపక గురుతువడునె। సాధువాసంబైన శాశ్వతానందంబు గురు డుబోధింపక గురుతువడునె। నారాయణాది సత్పారాయణాఖ్యాని గురుడుబోధింపక గురుతువడునె। తత్వములకెల్లపైనున్న తత్వమ హిమ। గురుడుబోధించకనుయెట్లు గురుతువడును। యట్టిమహ దాంశమును పొందనట్టినరుల। జననమరణంబు లెడతెగవనె ఫ ణీంద్ర. సీ॥ ఊర్ధ్వయోనిరమించు యోగ్యదేహువిలోన కర్మసాగ రమును గడచువాడు। యూర్ధ్వయోనిరమించు యోగ్యదేహువి లోన పరమార్థమునుపొంద బడెడువాడు। యూర్ధ్వయోనిరమిం చు యోగ్యదేహువిలోన జ్ఞానమజ్ఞానముల్ మానువాడు। యూ ర్ధ్వయోనిరమించు యోగ్యదేహువిలోన కడతేరుమార్గంబు గనెడు వాడు। గానదానిగాంచు ఘనుడెన్నటికినైన। తిరిగిపుట్టబోడు దేవసముడు। ఇచ్ఛగలుగునెడల నీక్షింపుమునిబల్కె। సుఖమొసం గుమయ్య సుబ్బరాయ. కం॥ ఇవ్విధమున బలుకగనే। నెవ్వడి ని నుతింపుచును మునీంద్రునితో నా। సవ్వడెరిగింపుమనుటకు। నవ్విభుడిటుదెల్ప బూనెనవనీస్థలిలోన్.

## ఆశ్వాసాంతము.

ఉత్సాహవృత్తము- శ్రీయుమామహేశ్వరాజ్ఞ చేఁజగత్ప్రసిద్ధిగా ।
వ్రాయఁబూనుకున్న సుబ్బరాయపద్యపద్ధతుల్ ।
శ్రేయమైన భూమినాదిశేషుకర్పణంబుగా ।
శేయవ్రాసినాఁడ హెచ్చుశ్రీలొసంగిబ్రోవఁగా॥

## గద్య.

ఇది శ్రీయుమామహేశ్వరానుగ్రహంబున శ్రీమదఖండసచ్చిదానంద
స్వానుభవాతీతుండగు హనుమునిగిరి శివరామబ్రహ్మేంద్రస్వా
ములవారుపదేశించిన సర్వంబును విశ్వబ్రహ్మ వంశపయః
పారావారరాకాసుధాకరుండగు పోకూరుసుబ్బరాయా
చార్యతనూభవ సుబ్బరాయాహ్వయుండాది శేషా
ర్పణంబుగా వ్రాయంబడిన సుబ్బరాయ పద్య
ములను మానవధర్మ ప్రదీపికయందు జ్యో
తిష సాముద్రిక శకునాది చిహ్నంబు
లుంగల కామ్య పురుషార్థ సంగ్ర
హంబను ప్రథమాశ్వాసము
సమాప్తము.



నాత్మానుభవమనా_త్త దెరంగుల్ । ధరణిగరతలామలకము । గుగ
తగునని బలికెగడిమి కుండలినాథా. కం॥ గురువరగురుశిశ్రూ
షల । తెరగునుయాత్మానుభవము తెల్లంబుగనా । కరలేక దెలు
పుమనగా కరుణాకరుడిటులబలికె గద్యవపుత్రా.

చతుర్విధశిశ్రూషల విషయము.

సీ॥ వినుభక్తశేఖర వివరింతుశిశ్రూష లనగస్థానాంగ ధ్యానా
త్తలందు । గురునిగృహారామ గోగణధనధాన్య వర్గరక్షణస్థాన ప
స్థతియున । పరమదేశికున కభ్యంగనస్థాన పాదార్చనల్ యంగ
సాధనమునందు । ధగగురుడే తల్లితండ్రి బంధువుదాత దైవంబట
నిగోల్వ భావమగును । గురువుకోరబడిన వరపదార్థములను । బ
లుకరించులోన దెలిసియొసగ । సదమల మతినున్న నదెయూత్మ శి
శ్రూష । గనుమటంచుబలికె ఫణివరేణ్య.

కల్లగురు శిష్య నడవడి.

గీ॥ ఎట్టియుల్లిగడ్డ నెన్నంగగురుడాయె । స్థిరను తెల్లగడ్డ శి
ష్యుడాయె । కూటికొరకు నెగడు గురుశిష్యులేగాని । సుఖముగాం
చుటకుగ సుబ్బరాయ. గీ॥ అప్పగొనియైన దొంగిలియైన తె
స్స । జహ్వాకింపైన దానిభుజింపవలయు । కంటికింపైన కాంతల
గలియవలయు । ననుచు నుపదేశమొసగెడ రనగవింటి. కం॥ ఇ
టువంటి కూహకంబగు । నటనలుగఅపుచును పోషణార్థముకోర
కై । కుటిలులు నమ్మించెదరని । భటువుగనను సుబ్బరాయ పర
మప్రీతిన్. కం॥ దెలిసితిమి సర్వమనిశి । ష్యులు మరికొందరిని
గూర్చుచును తదోచ్చథల్ । దెలుపుచు ధనమార్చించెద । రిలలోన
నె సుబ్బరాయ యినసమతేజా.

## నిజగురులక్షణము.

చ॥ నిజగురుడెట్టివాడనగ నిర్మలమానస యుక్తుడౌచు స । ద్వి
జనయొనర్చినన్పురుష వాక్యములాడిన నోర్చిధారుణిన్ । విజనస్థ
లంబునైన కడువేడుకలూరెడు పట్టమైనతా । నిజమగువెల్గునెం
చుననె నిశ్చయమౌ భుజగేంద్ర చంద్రమా. గీ॥ ఎండమావు
లకైవడి నీప్రపంచ । మరసివిడనాడి సర్వదాపగమగోష్ఠి । చేర
నుప్పొంచు బహుళోషహా జననమరణ । సూచననెఱుంగడనిబల్కె సు
బ్బరాయ.

## దేహిదేహవర్ణనము.

సీ॥ ఘటము దేహసంజ్ఞ ఘటమందునుస్థాలిత్య । జలమువతుయ
నిద్య తెలియబడును । జీవిజలమునందు చిక్కబింబముమాడ్కి।
సుఖమెఱుంగడనెను సుబ్బరాయ. కం॥ ఒకతెన్ను చీమునెత్తుక।
కఱుమాంస స్ఫురితమైన కండలుగలదై । చెడుగుముల మూత్రకో
శల । బకుహైగె యొప్పనినిబల్కబడెనుఫణీంద్రా. గీ॥ జలజపత్ర
మందు సలిలముండినభాతి । మృత్తునందుపుఱుగు మెలగినట్లు ।
దేహజాలమునకు దేహియట్లనె । సుఖమొసంగుమయ్య సుబ్బ
రాయ. సీ॥ తనువుజేసెటిపనుల్ తత్వంబునకునంట నేరవదోషల
న్నకూరిషదిను । జ్వాలను తీక్ష్ణంబెల్ల జగతికే తెలియును జ్వాల
ను డాతీక్ష్ణంబు దెలియగలడె । మణిరాజమును దెచ్చి మలినవస్త్ర
మునందు గట్టినన్ తద్గుణగణము జెడునె । దినమణిద్యుతి సర్వజన
రంజకంబయ్యె నతనుయెఱుంగునే యవనిలోన । నిటులతనుగుణావ
ర్తనలించుకైన । చేరలేనిది యాత్మకు జేరెననుచు । భ్రాంతినెం
దును జడఖర్త బ్రాకృతుండు । గనుమటంచును వచియించె ఫణీ

పరేణ్యా. గీ॥ తనువునాకులేదు తలపులునాకులే । యింద్రియంబు లుండు టెట్టిమాట । యేమినాకులేవు యున్నిటికి విసాక్షి । నను చు దెలియుమనెను ఫణిపరేణ్యా. కం॥ నమ్మినవారికి మెరకే । నమ్మకయిది దెగడుచున్న నయనగతంకే । నమ్మిహింసన్నువిమతమని । నమ్మదినిక్ దలచుమనెను సాహస్రఫణా.

## ఆత్మానాత్మవిచారము.

సీ॥ ఆత్మవిచారంబు అమృతానందంబు దెలియంగ నెవ్వరికల విగాదు । నిర్వచనీయమై నిష్ప్రపంచమైనదై నిర్వికారాత్మమై నిరు పమగుచు । నిశ్శబ్దమాత్రమై నిష్కళంకత్వమై నిశ్చలత్వమై ని త్యమగుచు । నామరూప క్రియానటనలనంటక దేహేంద్రియాదుల దెలియవశక । అంతఃభవనాన్ ప్రాతమునందుబడక । జ్ఞానవిగ్రహ- లమూర్తి సంజ్ఞనువెలుంగు । కేవలాద్వైత బ్రహ్మానందకేతమైన । స్వస్థతత్వంబు గనుమని సుబ్బరాయ. పంచపాదిగీతము. ఆట్టి తత్వంబుగానిద నాత్మరుదయు । సర్వలోకంబులను జెసెనొదేహ । ములనుగల్పించి సర్వకర్తలనుజెంచి । జననమరణావ్యవస్థల ననుభ వించు । మంచునని దెల్పె భువియందు సుబ్బరాయ. ఉ॥ గావున [illegible]ట్టి దని గాంచుచుసింను తరంగవైకరిక్ । యూవిమలత్వమును [illegible] సకప్కతలోకము లుప్పవించియుం । దేవిలయించి పూర్వపిజ తేజమునందు నటంమనీమన । ధ్యానమునం[illegible]ంప మనెభక్తసు [illegible]ంధవుడార్య వందితా. గీ॥ గానుపించెటి సర్వంబుగాంచువా ర । నైననేనును బ్రంహ్మంబెగాని యితర మేమియెచ్చోట లేదని మెరుగుచున్న । నదియెముక్తికి సామీప్యమని ఫణీంద్ర.

## భూతసృష్టిప్రచారము.

గీ॥ సద్గుణోత్తమ లోకముల్ జననమందు । టెట్లొగల్పించు

ఘనముఖుండెవడౌనింత । జీవసముదాయ మెటువలెజేసెనిట్టి ।
శ్లోక్యమనివేడ నిటుబల్కె సుబ్బరాయ. కం॥ వినుమీజగము
ల సృష్టికి । వెనుకటికాలంబునందు విశ్వావస్యాఖ్యుల్ । జనితంబు
గానివేళల । గనవిశ్వబ్రహ్మ గలిగెకరుణాసాంద్రా. కం॥ ఆవిశ్వ
బ్రహ్మముగన । లోవెలినంతటనునిండి లోకములందున్ । కీవివ
హించెపరాపర । మావిభుడనె సుబ్బరాయ మహితగుణాఢ్యా.
మ॥ సుఖదుఃఖంబులు బంధమోక్షములునాసుజ్ఞాన మజ్ఞానముల్ ।
ప్రకటంబై త్రిదివంబునారకతతుల్ బల్పుణ్యపాపంబులన్ । యక
లంకస్థితివిశ్వకర్తభువిలోనాధారకుండౌచుపే । సకలంబున్ సృజ
యించి మించెనిియున్ సాధించెభోగీశ్వరా. కం॥ తాయిని వి
శ్వబ్రహ్మము । శ్రీయుతలోకములసృష్టిజేయుటకాదిన్ । మాయ
నుబన్నియు గూడఁడ । మాయగదాసుబ్బరాయ మహితగుణాఢ్యా.

గీ॥ మాయయనవేరుగాదది మనసుమనసు । వలననీపదునాల్గు
భువనములయ్యె । నదిమహాశక్తి ప్రకృతియుయదె యనాది । మా
యకల్పితమనె సుబ్బరాయఘనత. సీ॥ అరయవిశ్వబ్రహ్మమా
దిలోమాయను గల్పించెనందున గలిగెనభము । నభమందు తాత
ముదయముగా నుదయించెవాయువు వలననువహ్నిబొడమె । వ
హ్నియందుదకంబు వరుసనుజనియించె నుదకమందున పృథ్వి
దముమీరె । పృథివియందోషధుల్ పెంపెక్కె నాయోషధుల
చేత నన్నముగలుగబడియె । నన్నమందున మదంబావిర్భవించెను
మదముచేతను కామమతిశయించె । కామముదయమైన కాలాన
బొడసూపె । నరులుమొదలెను బదినాల్గులక్ష । జీవిరాసియను
చు జెప్పెనుకడుప్రేమ । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. గీ॥
మాయలేనివాడు మాయకూడికచేత । మాయలోనజిక్కె తాయి

లేక । పరితపించుచుండు బహుబ్రాామికములతో । సుఖమొసం గుమయ్యా సుబ్బరాయ. గీ॥ ఘటములుద్భవించు కాలమందున జీవి । వడినిగర్భమందు బడెడుపాట్లు । జెప్పనలవిగాదు జగదిలో ననిబల్కె సుఖమొసంగుమయ్యా సుబ్బరాయ.

## పిండోత్పత్తి వివరము.

కం॥ దేవాపిండంబుఎట్లవ । మేవిధమున నయ్యెనందు కేదాధా రం । బావిధమును వినవలెనన । కోవిదుడిటుఃబలికెనయ్యా కుండలి నాధా. కం॥ మాయనుజేరక బ్రహ్మము । మాయనుజేరిననుక ర్త మాయనుజగతిన్ । శ్రేయుడు విశ్వబ్రహ్మము । మాయవల న విశ్వకర్తమాయఫణీంద్రా. గీ॥ క్షితినికర్త మనగజేయుట క ర్తంబు । అట్టికర్తవలన బుట్టెజన్మ । జన్మకర్తలందు జనియించె లోకముల్ । సుఖమొసంగుమయ్యా సుబ్బరాయ. కం॥ ఇలయం దు క్షుత్తునొకటిని । గలిగించెనువిశ్వకర్త కర్తనుబెంచన్ । దల పగ నంతానజన్మం । బలరాలెను సుబ్బరాయ యనఘ్యతమరయన్.

కం॥ పనులను వ్యాపారములను । గనన్యవహారములచేత గను తింపంగా । గుణావృత్తివలన కర్మము । జనియించునటంచు బలికె సజ్జనచరితా. గీ॥ కర్తపూనుపాళ్లు గాబడియప్పుడు । కొంతయ నుభవించు కొంతజన్మ । హేతువయ్యె కొంత వెనుకద్రోక్కుచు పూర్వ । సుకృతమనగ నెగడు సుబ్బరాయ. గీ॥ మునుపుజేసిన త లిదండ్రి మోహకర్త । తనుయొనర్చిన గతకర్త మనుసరించి । శు క్లశోణితసన్నిశ్రశుద్ధివలన । పిండమంకురమగునని కుండలేంద్ర.

సీ॥ ఘనతరరేతస్సు గర్భగతంబైన పైత్యంబుప్రబలుచు శైత్య మడచి । వాతాత్మకము పిండవాటమొనర్చుచు తనువుకారంభమై

ధరనుశీర్ష । మర్ధమాసంబునం దవతరించును మాయమాసమున దే
ర్పడు భాసురముగ । యిరుమాసములలోన నురముద్భవంబౌను
మూడింట సర్వాంగములుజనించు । నాల్గింట వాయువునయమొ
ప్ప ప్రబలును నైదింట రోమంబులలరుచుండు । నారవనెలలోన
నరయసందులుగల్గు । సప్తమమునప్రాణ సముదయంబు । గలుగు
నెనిమిదింట జ్ఞానమొందనియెను । సుఖమొసంగుమయ్య సుబ్బ
రాయ. సీ॥ గణుతింపగామాతృ గర్భసింధువునందు । శిశుసంఘ
మెల్లను జిక్కువడుచు । విలపింతురెట్లన్న వినుమీశ్వరాయెంత
పాపంబొనర్చితో బహుళమైన । నరకవారధియందు నన్నుంచనా
యమా యీవాంసమీచీము యీయపంహ్య । మీరక్షమీమ
ు మీమూత్ర మీపాప మీకూపమందున మెలగనైతి । యేమి
నాప్రాప్తషిలాయె నెవరుదిక్కు । దరినెరుంగకనుంటినోదై
వరాయ । నన్నుకడతేర్చుమాయని కన్నవస్థ । లెన్నొబడుచుండు
ననిబల్కె పన్నగేంద్ర. గీ॥ అనుచువిలపింప నవమాసమైనపిదప ।
యోనియను ద్వారమందున యుద్భవించు । యోనిదవిలినమా
త్రాన జ్ఞానముచెడి । మూఢదశనొందుననిపల్కె భోగివర్యా. గీ॥
ఫుట్టినేలబడిన భూరిమాయయుగప్పి । మతివిహీనుడగుచు మంచ
మందు । బడితపించుచుండు బహుళవేధలచేత । సుఖముగాంచడ
నెనుసుబ్బరాయ. గీ॥ తల్లి పెనుచుచుండ ధరనునానాటికి । ప
ట్టుబడు ప్రపంచబాటలెల్ల । నట్టివిషయములతో నానందమును
చు । మొదలెరుంగడనేను భుజగరాజా. సీ॥ భువివాసనాత్ర
యంబులచేత పొరలాడు యీషణాములబడి యీదుచుండు । న
ష్టమదంబులం దలరారుచుండును త్రిగుణవృత్తులచేత తేజరిల్లు ।
తాపత్రయములలో దగిలివర్తింపుచు గనపడూర్మలలోన గట్టువ

డును । యిట్లు ప్రారబ్ధవశమునందిహాలోన । దిక్కు తెలియక రస పిచ్చి యెక్కువగుచు । మాయసంసార సాగరమందు మునిగిలి । ము నిగితేలుచురనిబల్కె ఫణివరేణ్య. కం॥ వాసనయీషణములన । న్దేశికవర మదములనగ త్రిగుణాదులన । స్వాసిగ నెరిగింపుము ప్రి య । దాసునకనిట్టులనియె ధరను ఫణీంద్రా.

వాసనత్రయవివరము.

సీ॥ వినులోకవాసన యనిశాస్త్రివాసన యనిదేహవాసన య నిజలంగు । లోకవాసనయన లోకంబనుసరించు కాకితములకు వి వేకుడగును । శాస్త్రివాసనంగ జపతపహోమాతర్పణ వ్రతక్రతు వుల దనరుచుండు । దేహవాసనంగ తీర్థయాత్రాదుల దేహము శుష్కించ దిరుగుచుండు । యిట్టివాసనలందున కట్టుబడుదు । ఫ లమునందంగ వలెనను భ్రాంతివలన । కష్టదశనొందుచుండును క ష్టజీవి । సుఖముగమనించడనిబల్కె సుబ్బరాయ.

యీషణలవివరము.

సీ॥ ఒకటిదారేషణం బొకటిపుత్రేషణం బొకటిధనేషణంబున రెసంగు । దారేషణమనంగ కోరికల్ దీర్చను భాగ్యగావలెనను భ్రాంతినొందు । పుత్రేషణంబన పుత్రులు లేకున్న గతులుగల్గవ టంచు కాంచబోడము । ధరధనేషణమన దానధర్మమువల్ల తరియిం తు నను కోర్కె తరుచుగల్గు । గానయీలాటివృత్తులలోనజేరి । దిక్కుదెలియక సజ్ఞానదీపమందు । భూరిమరుజన్మ కాధారభూత మైన । పనులు జరిగించుననిబల్కె పన్నగేంద్ర.

అష్టమదముల వివరము.

కం॥ కులశీలధనమురూపం । బలయవ్వన విద్యరాజ్య మెన్నగ

నుతమం । బులు నెనిమిది దలపగమద । ములుగావర్ణింతుర నెను
భుజగశ్రేష్ఠా॥. సీ॥ కులమదంబనగొప్ప కులమునబుట్టితి తక్కిన
వారెల్ల తగ్గటనచు । శీలమదంబన శిష్టనిష్టాచారుడనునాకు సము
డేడి జనుడటంచు । ధనమదంబనియన ద్రవ్యముగలవాడ పృథివి
లో నాకేమి కొదవటంచు । రూపమదంబన రూఢిగాసౌందర్య
వంతుడననుచు గర్వంబుబెంచు । యవ్వనమద మేదియన దండిబలు
డను కొండలైనను జేతు పిండియనుచు । విద్యామదంబన వివిధ
శాస్త్రంబులు చదివితినెవడు నాసముడటంచు । రాజ్యమదంబన
రక్తి విదేశాధిపత్యంబుగలిగియుండు వాడననుచు । తమమదంబన్న
ను తగస్నానసంధ్యాద్యనుష్ఠానములను సంతుష్టుననుచు । నుబ్బిత
బ్బిబ్బులాడుచు నుండిజనులు । పట్టపసలేనియానంద వార్ధిదేలి ।
యంతకునిపాశ బంధకమందుజిక్కి । సుఖముగానంగలేరనె సుబ్బ
రాయ.

## త్రిగుణవర్ణనము.

సీ॥ సాత్వికుండనభూమి జపతపహోమాది సత్కర్మ సత్క్రి
యల్ సలుపుచుండు - గనరజోగుణుడన కామ్యాదివృత్తులు పర
రాష్ట్ర పరధన భ్రామికుండు - అరయతమోగుణుండగ్ని హో
త్రసమానుడతియుగ్రమూర్తియై యలరుచుండు - సాత్వికునకు
రాజసము సగంబుండు రాజసములో సగము తామసముగలదు -
రాజసగుణునకు రంజిల్లుసత్వము సగమౌచునందున సగముతమము
తామసాత్మునరయ తగ రాజసముసగం - బగును రాజసమున సగ
ము సత్వ - మమరియుండుననుచు మహిజనుల్వినబల్కె - సుఖ
మొసంగుమయ్య సుబ్బరాయ.

## తాపత్రయలక్షణము.

సీ॥ తాపత్రయమన నధ్యాత్మికంబాది భౌతికమన నాదిదైవి
కములందు । అధ్యాత్మికంబున నలరుచుండును దేహజనితత్రివిధ
రోగగణముదలప । ఆదిభౌతికముస నీధరిత్రినిచోర వ్యాళవృశ్చిక
భూతబాధలెల్ల । ఆదిదైవికమన నమరువర్షాశనీ పాతవాయుర్వగ్ని
బాధలమరు । యిట్టితాపత్రయుంబులీ యిహామునందు । కర్మజీవు
ల పరిపక్వకాలమందు । నంటివేధింపుచుండును కంటకముగ । న
నుచువినుపించె కృపచేత ఫణివరేణ్య.

## షడూర్ములవివరము.

సీ॥ యిలషడూర్ములనంగ నెటువంటివందువా వినుపించెదనువి
నుమీనులలర।ఘనతరక్షుధత్రుష్ణలును ప్రాణధర్మములని వన్నె కెక్కె
ను లాలితముగ । శోకమోహంబులు శోధింపగామనో ధర్మం
బులగుచుండు దరచిజూడ। చావుపుట్టుకలెల్ల జడరూపమైనట్టి దేహ
ధర్మములని దెలియబడును । వీటిలోనజిక్కి యిట్టట్టుమెలగను ।
సందులేక జనులుజగతియందు । మందబుద్ధిచేత మార్గంబుగనరని।
సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## అవస్థాత్రయవివరము.

సీ॥ గననవస్థాత్రయంబన జాగ్రతనిస్వప్న మనిసుషుప్త్యని భూ
మి దనరుచుండు । జాగ్రదవస్థన సర్వధర్మంబులు జీవిభ్రూమధ్యను
జేరుతరిని । నిదురమేల్కొనిపైని నిదురవచ్చెటిదాక జేయుచేష్ట
లటంచు జెలగుచుండు । స్వప్నాద్యవస్థన జాగ్రతలోగల ధర్మంబు
లనుకంఠ స్థానమందు । జీవుడుండగస్వప్న భావంబుగనిజూచిజూడ
ని వింతలతోడగూడు । తగుసుషుప్తియనగ తాలువగతమోచు ।

జీవుడలరిస్వప్న చేష్టలేక । సౌఖ్యనిద్రనొందు సాధనమనిబల్కె-
సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## పూర్వజన్మనిరూపణము.

సీ॥ భువిజీవకోటికి పూర్వజన్మము లేదనందురు యజ్ఞానమందు
దవిలి । యదియెట్టులన్నను హరిణాంకు హరిదశ్వుపగది జీవేశ్వర
బాటగనుము । క్షీణవృద్ధులుగల జీవున కెటులేకపోవును తర్కింప
బూర్వజన్మ । పూర్తిసాక్ష్యంబులు బోధించుచున్నవి భ్రమయుం
డువరకు జన్మముగలదిక । కర్మసమితిద్రోసి నిర్మలతత్వమునం
దు । మనముగలుపునట్టి ఘనుడుదక్క । జన్మకాండదాట జాలడం
చునుబల్కె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## సప్తావరణవివరము.

సీ॥ అరయసప్తావరణార్ణవంబున జీవుడీదుములు బడుచుండు
గడమిలోన । దుఃఖంబుదేహంబు చొక్కమాకర్ణంబు రాగాదు
లభిమాన సాగరంబు । అవివేకమజ్ఞాన మివియొకటొకటిబోయిన
బోవు పైయాత్మగనినవాని । కజ్ఞానమునశించు గావుననాత్మోదయ
ము నొందసజ్జనసముదయంబు । సంగమొనరి మోక్ష సాధనగనవ
లె । నట్లుగాక మరియుకెట్లుగాదు । గానదెలియుడనుచు కడుప్రే
మతోజెప్పె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. గీ॥ మోక్ష
సాధనలన నీక్షితినెఱిగించి । నన్నుధన్యజేయుమన్న మొదట । స్వ
ర ప్రభావమెరుకవరచి యవ్వలముక్తి । బాటదెలుపుదనెను వ
న్నగేంద్ర. కం॥ స్వామీగురువులనడపడి । కేమో గురుశిష్య
న్యాయమెట్లో గోవిన్ద । నామదిగోరినదనగా । నామహితాత్ముం
డు బలికె నగధరతల్పా.

## గురువులచరిత్రము.

సీ॥ జలమందుమునిగినా జపమాలద్రిప్పినా కాషాయచేలము ల్గట్టనైన। జన్నిదా లేశిన జటధారిరైనను భూతియుబూశినా బోడియైన। రోమాలుబెంచినా నామాలుయుంచినా నీమాలుం చేపట్టి నెగడుచున్న। రుద్రాక్షలేశిన ముద్రలుగలిగిన ప్రతితీర్థ యాత్రలఁ బడయుచున్న। వాయుభక్షణనున్న పాయసాన్నము తిన్న తరిమిగంజాకల్లు త్రాగుచున్న। అన్నంబుమానినా ఆకులు నమలినా కాయగరువుబుదిన్న కాననున్న। నిన్నివర్తనలున్న లేకున్ననొకటె। బట్టబయలైన బ్రహ్మంబు గుట్టుదెలశి। స్వానుభవశుద్ధుడైనట్టిజనుడు శ్రేష్టు। షతనికేజెల్లు గురునామమనె ఫణీంద్రా. సీ॥ ఒకచోటయోగంబు నొకచోటు భోగంబు నొకచోట రోగంబు నొందుచుండు - నొకచోటత్యాగంబు నొకచోట మంత్రంబు నొకచోటధ్యానంబు నొదవుచుండు - నొకచోటలక్ష్యంబు నొకచోటను సమాధియొకచోట కూటమైగూడుచుండు - నొకచోటభక్తియు నొకచోటజ్ఞానంబు నొకచోటశాస్త్రంబు నుచ్చరించు - నొక్కచోటనుయుర్విలో నూరకుండు - నొక్కచోటను బ్రహ్మంబు నూహజేయు - నొక్కచోటను అంహికంబుండగట్టు - నొక్కచోటకమానని మరగరాజా. గీ॥ నవ్వునొకచోట నాదరణంబునొందు। ఆడుచుండునుపిల్లల నాదరించు। గానమునుజేయు బ్రహ్మముఁ గాంచుచుండు। ఇట్టుదీవించువనిబలికె దివ్యచరితా.

## గురుశిష్య న్యాయలక్షణము.

వ॥ మరియు గురుశిష్యులకు మర్కటకిచూర మార్జాలకిచూర

భ్రమరకీటక న్యాయంబులను మూడుమార్గంబులు గలవవి యెట్ల నినా. సీ॥ కోతిపిల్లనుగని కూడదీయనుగద రాతిరైన మహాప రాతిరైన। పిల్లపట్టగాని తల్లిపట్టనరాదు పిల్లకేమయినను పిడికి పడను। కాననంబులుదిరుగు గండురాళ్లనుదాటు వృక్షంబుపై నుండి విద్యజూపు। యిచ్చేమిశోయను ముచ్చటించనుదాని పి చ్చేమిటోకాని పిలువదెపుడు। పట్టువదలినదానిని పట్టుకొనను। తిరిగిజూడను పిల్లపై దీనవృత్తి। బడయిట్లాటి గురువుల కడను జేరి। లాభమేమిన్ని లేదనె శోభనాంగ. సీ॥ పిల్లికూనలబెట్టి పిల్లకుపాలెట్టి యిమ్ముగనచోటును వెదకులాడు - తావుకుదిరే వరకు తానోటగరచుక పోయిపిల్లనుబహు పోషిమిగను - పో షించుతన విద్య పూర్ణంబుగాజెప్పు పైకాపుగాచి పైపై నడిరుగు తల్లితోసమమైన తాపీసినట్లుగా ముల్లోకములగురునూాలవిద్య - జెప్పిశిష్యుడు తనరూపుజెందగానె - యప్పసీరినసంసారి యననిదిరుగు - నటులశిష్యుని దిగనాడి యనితవేష్ట - దిరుగుదేశికుడని బల్కెదివ్యమూర్తి. గీ॥ కీటమును దెచ్చి భ్రమరంబు గూటనుంచి - క్షితినిఝంకారనినదముఁ జేయుచుండ - నదియుకూమ్మెడి రూపమై గదలిపోవు - కరణిగురుమూర్తి తనశిష్య గణముకును - మార్గమును దెల్పవలెనని మంజువేషా.

## స్వరపరీక్షాక్రమము.

గీ॥ స్వరపరీక్షజెపుదు శంకరుప్రీతిగా - నదియుముక్కబిలము లనుసరించి - కుడినెడంబునడుమ కూడతిరుగునని - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. కం॥ ఇడయనగ నెడమభాగము - కుడిభాగము పింగళనుచు గూడునుగనయా - నడుమైననుషుమ్నంబని

కడువడినని సుబ్బరాయ కనికరమొదవన్. కం॥ ఇడయనచంద్ర స్వరమగు - వడిపింగళయనగసూర్య స్వరమనిపించున్ - పుడమిని యీస్వరకూడిక - కడువింతయటంచుబల్కె కరుణాకరుడై.

గీ॥ ఐదుఘడియలు కుడి నైదుఘల్లెడమను । మార్పుగలిగి స్వరముమసలుచుండు । యెడముచంద్రస్వరము కుడిసూర్య స్వరమనె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ నాడిజేరియు స్వరంబాడగా నొకఘటికాకాశతత్త్వమై యలరుచుండు । రెండవ ఘడియయందుండు స్వరంబు మారుతయంశమై చాలరూఢిపడును । మూడవ ఘడియయందాడెటి స్వరము పావకతత్త్వమనవచ్చు ప్రకటితముగ । నాల్గవఘడియలో ననుపృథ్వితత్త్వంబు నైదింట జలతత్త్వమగునుసుచియు । నభము చేవగు పవనముపల్లదనమగ్ని । కారమైనది నుదకమగువగరు । పృథివితీపుగలిగి పెంపెక్కనని జెప్పె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ స్వరము వెల్వలరాక చాలవ్యాపకమైన నాకాశతత్త్వమై యలరుచుండు । వెలికినాల్గంగుళాల్వెడలి చంచలమైన వాయుతత్త్వంబని వర్ణనమగు । పుడమెన్మిదంగుళాల్వెడలి వేడిమినున్ననగ్ని తత్త్వంబననగునుగడిమి । అరయగాపదియునారంగుళాలై చల్లనమైన జలతత్త్వమనుచునెగడు । పృథివినెంచిజూడ పదియురెండంగుళా । ల్గనవిలంబమగుచు గానబడును । గానదెలుయుడనుచు కడుప్రేమతోజెప్పె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## తత్త్వములు. ఆకారములు. రంగులు.

సీ॥ నభముకర్ణాకృతి నలుపువర్ణంబౌను వాయుతత్త్వము వట్రువాకుపచ్చ । ననలతత్త్వము త్రిభుజాకృతి రక్తవర్ణబౌను పృథ్వితత్త్వంబునాల్గు । కోణములన్ పసిమియుకులతలమం దుదకతత్త్వము నె

న్న నర్ధచంద్రాకృతన్ని । రంగులుగలదిగా రాజిల్లు లేకున్న తెలు పువర్ణంబని బలుకబడును । గనుకనిట్టివిధము గని పెట్టనర్దంబు । చాతబూనియుందు శ్వాసవిడువ । ననుభవంబు కొలదిగనవచ్చునని జెప్పె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. గీ॥ స్వరముచంద్ర మైన చాల పెంపగుపనుల్ । సలుపవచ్చు సూర్యస్వరమునందు । జయముదెచ్చుపనులు జాయంగనగునని । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## శ్వాసక్రమము.

సీ॥ శుద్ధపాడ్యమినాడు ప్రొద్దుబొడువ చంద్రస్వరమాచునుండి యవ్వలనుమూడు । రోజులావేళలో రూఢిగానాస్వరంబాడి పై మూణ్ణాళ్లు భానుస్వరము । ప్రబలుచునీరీతి పైదినంబులయందు మార్పుగల్గవలె మరియుబహుళ । పాడ్యమిప్రొద్దున భానుస్వరం బాచు పైజెప్పువిధమున బరగవలయు । నిట్లు రాత్రిపవలు నీసూర్యచంద్రులు । మార్పుపదియు రెండు మార్లుగలిగి । యొప్పుచుం డురనుచు జెప్పెనార్యులు మెచ్చ । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## అంతరతత్వములు.

గీ॥ తత్వమెడలుచున్న తరినభంబాదిత । త్వంబులంతరమున వ నరుతత్వ । పరిమితివిఘడియలు పదిరెండటనిబల్కె సుఖమొసంగు మయ్య సుబ్బరాయ. కం॥ ఏసమయంబున నాస్వర । మాసక్తి తొనాడకుండ మారుగనాడక్ । వాసిచెడి యతనుబహుగా । గా సిలుసన సుబ్బరాయ కరుణాభరణా. గీ॥ చంద్రస్వరమునందు జలవసుంధరలాడ । జయముగలుగు సూర్యస్వరమదట్లు । ప్రబ

లివహ్నియటుల ప్రబలమేలనిజెప్పె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## మృతశోధనతత్వము.

సీ॥ ఒకరాత్రిబనలంత నొగివహ్నితత్వమై యొకముక్కు బిలమున నొనరవచ్చు - చున్నమూడేడుల కుర్వీమృతుండౌను టిమణితో కుడిముక్కు రంధ్రమునను - రెండుదినంబులు దండిగానడు వంగ రెండువర్షంబులు నిండజచ్చు - రాత్రినినెపము రంధ్రముబవలే కుడినాడ మరణంబు నొందారుమాసములకు - మూడుకోజులొక్క ముక్కుబిలంబున - వాయువెడలెనేని పదియురెండు - నెలలోననీల్గు నిలమీదననిబల్కె - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ మంచినడకల కస్తాత్తుగాచెడుగైన నెనిమిదినెలల మీదను యడంగు - నరచేతిలోనైన నంగిటిలోనైన గాయంబు దగిలియు క్రమముగాను - నొప్పిగల్గకయున్న నుర్వేషునెలలకు జనిపోవునడినేర్పిల్లు గనగమూడు - వంగకుండుట రోగవంతుడుగాకుండి మాటలోప్పించుట మరచుటయును - నరయపిట్టులున్నా నాల్గు మాసములకు - శమనుపురముజూడ గమనుడగును - గినుకనిట్లు జెలియ ఘనులందురనిబల్కె - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ మెదుపకొమ్మున స్పర్శమెవడెఱుంగడో నాతడైదవమాసమందడగు నిజము - దీపంబుకంటికి దోపినకుండిన నాల్గునెలలలోన నీల్గవలయు -. ఆస్యమస్తకముపై హస్తమస్తకమిడి మడికట్టుపైదృష్టి మలిపిజూడ - స్థూలమైననువ్యాధి సూచించుసూక్ష్మమైనను భువినారోగ్యమునజెలంగు - హరణమైనయెడల నాల్గైలలునుదాట - గమనుడగును వేగశమనునగర - మునకటంచు జెప్పె ఘనప్రేమమీరగ - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## సాధనచతుష్టయ వివరము.

సీ॥ నరనసాధనచతుష్టయము జెప్పదలంతు నిత్యమనిత్యము నెరుగుటొకటి - దలవననిత్యవస్తువవల్ల గలిగెడు ఫలమునిరోధింప బడడమొకటి - శమదమంబుపరతి శ్రద్ధతితీక్షసమాధానమను చును మనలుటొకటి - గనగముముక్షత్వమనము క్తికినిచేరువై జె లగుచునున్న వస్తువొకటి - యిట్టిసాధనంబు లెవనికిసంప్రాప్త - మగును వానిఫలము జగతిలోన - యింతయంతగాదనంతమౌనని జెప్పె - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## నిత్యానిత్యవస్తువివేకము.

కం॥ పరమగుబ్రహ్మము నిత్యము - ధరణిప్రపంచంబనిత్య దము దలపోయన్ - వరనిత్యత్వముము క్తిద - మరయప్రపంచంబు బంధమనెను ఫణీంద్రా. గీ॥ జననమరణాద్యవస్థల జారనీక - పుత్రమిత్రకళత్రల పొందుగొనక - పుణ్యపాపంబులంటక పూర్ణబుద్ధి - నిజముదర్శించనగునని భుజగశ్రేష్ఠా.

## యిహాముత్రార్థ ఫలభోగవిరాగము.

కం॥ ఇహాస్వర్గభోగములను - మహనీయత్వంబు నెందు మనుజుడెవడున్ - ఇహామందునగాంక్షింపడు - నహజగతిన్ దెలియుమనెను సాహస్రఫణా. గీ॥ లభితపమునవే మొలభియించక నుబోవు - లభితపడనివే మొలభితపడవు - యేవియెట్లులైన యెంచనేవలదని - సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## శమాదిషట్కము ముముక్షుత్వము.

సీ॥ శమముమనోనిగ్రహ ముదమంబనజ్ఞానకర్మేంద్రియములల

లో కమునవిషయ । ములబడనీయక నిలుపుటయుపరతి యనపు న్యాసముదాయ మునుయొనర్చి । యిలవరునకు ప్రేమ గలిగించుట యుశ్రద్ధ యనదేశకుని యీశ్వరునియెడలను । విశ్వాసముంచుట వినుముతితీక్షయనంగ దుర్భిక్షంబుననుసుభిక్ష । మునుసమత్వంబు గా గనుటసమాధాన మనగవేదాంతంబు వినెడుసమయ । మందు చలనవృత్తినొందనీకమనస్సు । గట్టివేయబడుట గట్టిగాను । మోక్షమరయుటయు ముముక్షుత్వమనిజెప్పె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## తారకలక్షణము.

కం॥ ఓరీమత్ప్రియశిష్యా । తారకసాంఖ్యామనస్క ధర్మము లుగనర్ । కూరిమినాత్మకు సుఖమగు । కారణమనె సుబ్బరాయ కరుణాభరణా. కం॥ ధరసర్వతత్వములకును । పరమైయవ్వలను తెల్లబడుమహాతత్వం । బరయగను గురువుదెల్పక । గురుతిడదనె సుబ్బరాయ కుండలినాథా. కం॥ కనులనడినెగడుచుండెను । మిణుగురు బూచులనుగాంచి మేదినిలోనర్ । దినదినమును సేవించెడి । జనులేఘనులనుచుబల్కె సాహస్రఫణా. కం॥ శిఖరము లోననవరతము । సుకరస్థితి ఝాంకరించు నుగుణునిభువిలో । నక లంకమతినిగొలచిన । సుఖవంతుండౌనటనెను సుబ్రహ్మణ్యా. కం॥ ఆరింటి మాయుచుననడి । దారిద్ర్యాామనంబు దగిలించగబల్ । ధీరతదశవిధనివదము । లారయగాన్పించుననియె నహికులచంద్రా.

గీ॥ గజ్జముప్వశంక ఘంటారవంబును । వీణతాళభేరివేణువాది । దశవిధంబులైన ధ్వనులుప్పతిలునని । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. గీ॥ ఇవియుపదివిధంబులే కీభవింపగా । నచటగలుగ బడిరెు నఖలజగము. । లుద్భవమునకాది యోంకారమనిజెప్పె ।

సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. గీ॥ గడిమినాదముబిందువు కళలచటనె । నెగడుచుండునుగావున జగతిలోన । ప్రణవనాదామృతము గ్రోలుఘనునిమహిమ । జప్పశక్యంబుగాదనె సర్పరాజ.

కం॥ కాటుకపిట్టలనడుమను । సూటిగనాటించిదృక్కు చోద్యములుగనర్ । నేస్తైనవాడుభువిననె । ఘాటంబుగసుబ్బరాయ కారుణ్యనిధీ. కం॥ వరచంద్రమండలంబును । ధరకింజల్కములు యింద్రధనువుర్ మణులుర్ । మరియగ్నిమిణుగురులు ను । స్థిరవెన్నెల గనుమటంచుజెప్పె ఫణీంద్రా. సీ॥ శ్రీగురుపదసేవజేయుచుండినగాని హంకారమనుగజంబణగిపోదు । ప్రణవనాదామృతపానమందకగాని కర్మసాగరమును గడువలేదు । భువిశత్రురాక్షసములపొందెరుంగకగాని కామాదితస్కరుల్ కట్టువడరు । పంచవింశతితత్వమెంచి వీడకగాని యభిమానభాస్కరుండడగిపోడు । పంచబంధవిముక్తి పట్టెరుంగకగాని యవివేకమనుతమంబణగ దరయ । సరసపూర్ణబోధ గురుతెరుంగకగాని । మలినమెరుకభాటమట్టుబడదు । గానదెలియుమనుచు కడుప్రేమతోబల్కె సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## పంచముద్రలవిషయము.

గీ॥ అనుభవములేని జ్ఞానంబదార్తనెటుగ । దనుభవములేని యాచారమది విఫలము । అనుభవములేని గురుభక్తిపనికిరాదు । గనుక ననుభవమేముఖ్యమనె ఫణీంద్ర. గీ॥ పరమగురువర్య నావంటి పామరాళి । పాలిదేవుండవనిగొల్తు పంచముద్ర । లనగయోగాసనములని యనగనేవి । దెలుపుమననిట్టుబలికెను ధీజనసత.

వచనము భక్తాగ్రణీవినుము - జ్ఞానులగువారు ధరించెడి సాధనములు పంచముద్రలు, అవిఖేచరియు, భూచరియు, మధ్యలక్ష్య

యు, షణ్ముఖయనియు, శాంభవియు, యనునైదు విధంబులగునం దు. కన్నులుమూసినదైనను, మూయకన్నైనను, చూపునుమలిపి, భ్రూమధ్యముననుంచి - మీదిదిక్కుననుండుచిదాకాశమునుజూచు చున్నదదే ఖేచరిముద్రయనంబడు - కన్నులను కదలించక ముక్కు కొనయందుదృక్కునిలిపి - చూచుచున్నదదే భూచరియనంబడును అర్ధకన్నులచూపును ముక్కునడుమను నిలిపి - మీదనున్నను మరు ను జూచుచుండెనేని అదేమధ్యలక్ష్యమను ముద్రయనంబడును చెవులు, ముక్కులు, కన్నులు, వీటిమూసి. వెలుపలిదృక్కుమన స్సులను భ్రూమధ్యమందునిలిపి - నాదబిందుకళలను వీక్షింపుచు న్న - నదేషణ్ముఖ యనంబడును - ప్రాణాది వాయువులను మనస్సు మొదలగు పదునాలుగింద్రియముల జయించి - కన్నులను దెరచు కొని చూపులను చిదాకాశముననిలిపి - అక్కడివింతలనుగాంచి చొక్కుచున్నదదే శాంభవియనందగు - యీపంచ ముద్రలయం దున - సూర్యచంద్రాగ్ని మండలములయందలి ముప్పదియెనిమిది కళల జూచుటకును - ఓంకారాది దశవిధనాదములనుచిద్బిందువు ను - అంమకళలను జూచుటకును సాధనమని జెప్పి సిద్ధాసనాది కొన్ని యోగాసనముల తెలంగజేంగించెనెట్లనిన.

## యోగాసనముల విషయము.

ఎడమకాలిమడిమ గుదస్థానమందును - కుడికాలిమడిమ లింగ స్థానమందుంచి - శిరము, కంఠము, భుజములు నిక్కించి భ్రూమ ధ్యావలోకన జేయుచుండిన నిదిశిద్ధాసనము - దీనిచే యింద్రియ నిగ్రహము నిర్మలచిత్తవృత్తి గలుగుచుండును - భద్రాసనము. అండములకు క్రిందిప్రక్కలయందు చీలమండలనునిచి రెండుమడి మలను రెండుచేతులతోపట్టి కదలకుండిననిదే భద్రాసనమనంద

గును - పద్మాసనము. యెడమతొడపై కుడిపాదమును కుడితొడపై నెడమపాదమును బెట్టి చేతులను వెనుకప్రక్కగాద్రిప్పి కుడిచేతితో గుడికాలిపెద్దవ్రేలును యెడమచేతితో యెడమకాలి పెద్దవ్రేలును పట్టుకొని రొమ్మునగడ్డముంచి భ్రూమధ్యమందు దృష్టినిల్పినదే పద్మాసనము. కూర్మాసనము - గుదస్థానమునకు యిరుపార్శ్వములను రెండుకాళ్ల మడిమలను హత్తించి నిక్కచక్కగా కూర్చున్నది కూర్మాసనము. కుక్కుటాసనము - పద్మాసనము పెట్టి కూర్చొని మోకాళ్ల తొడల సందులలో చేతులనుదూర్చి హస్తములనేలనూని పైకెగసినట్లున్న నిదికుక్కుటాసనము.

గుదస్థానము అపానుని సంచారముగా నిన్నెక యెడమమడిమచే బంధించుట మూలబంధమనబడును. కుడిమడిమచే నాభినిబంధించుటే వుడ్యాణబంధమగు. గడ్డము రొమ్మునందుంచుటే జాలంధర బంధము. యీయాసనాది బంధములవలన యోగాభ్యాసులు వార్ధక్యాది మృత్యుభయంబులు లేక మోక్షసాంబ్రాజ్యమందంగలరని చెప్పి మరియునిట్లనియె.

## అక్షరస్వరూపము.

గీ॥ అండమందుజూడ నఖిలచరాచర । మమరివెలుగుచున్న దదియుదెలిసి । నిశ్చయంబునొంద నీకుసమానుని । జూడబోనట నెను సుబ్బరాయ. వచనము - యీఅండశోధనయందు అండపిండ బ్రహ్మాండంబులుగలవవి యేవన్నను అండమనగా గ్రుడ్డు పిండాండమన బిందువనెపాప. బ్రహ్మాండమనగా ఆపాపమధ్యవెలిగేకళ. ఆకళలో వెలిగేనిష్కళ బ్రహ్మము. పంచభూతవివరము పృథివి యెఱుపు, ఉదకము తెలుపు, అగ్ని నలుపు, వాయువు బిందువనెడు పాప, అకాశమే కళ, ఆనిష్కలే పరబ్రహ్మము. త్రివేణి

వివరము - పైనలుపు గంగానధి, బిందువనెడుపాప యమున, కళే సరస్వతి, అదే విద్యుల్లేఖ, అదే ముక్తికాంత, నిష్కళే పరబ్రహ్మ ము. త్రిమూర్తులవివరము - యెరుపు అనునదే బ్రహ్మము, తె లుపు విష్ణువు, నలుపు రుద్రుడు, యివే అకార ఉకార మకారము లు, యిదేహృదయకమలము. నిద్రసంగమాదులచటనేయుండును. ఆలోనికళయందే ఝుంకారమైన నాదము, అందునిశ్శబ్దమైన నిష్క ళే పరబ్రహ్మము. పంచశక్తుల వివరము - ఎఱుపు ఆదిశక్తి, తె లుపు యిచ్ఛాశక్తి, నలుపు క్రియాశక్తి, పాప జ్ఞానశక్తి, కళ. ప రాశక్తి, లోపలి నిష్కళే పరబ్రహ్మము. రేచకపూర కాదులవివ రము - రేచకము యెరుపు, పూరకము తెలుపు, కుంభకము నలు పు, సూచకము బిందువనె పాప, కళలో నిష్కళెబ్రహ్మము. మం డలత్రయ వివరము - పైనలుపు అగ్ని మండలము, బిందువే సూ ర్యమండలము, కళే సర్వప్రపంచము లైన చంద్రమండలము, అం దునిష్కళే యెరుకమరుపులును తెలిసే తత్వస్వరూపము. సచ్చిదా నంద వివరము - సత్తుఅనగా తనలోపలవెలిగే దీప్తి, బిందువనే పాపయున్ను, బాహ్యమందుగల వస్తువారి అంతయున్ను చిత్తు, సర్వప్రపంచములు నెరుగక నిష్కళయగు జ్యోతిస్వరూపమందుని లిచి అదితానుకావడమే యానందము. పదత్రయవివరము - తత్ప దమనగా ప్రకాశమైన తేజస్సు, త్వంపదమనగా బిందువు, అశిపద మనగా ఆబిందువుయందు మనస్సు విస్తరించి ఆలోపలినిష్కళ తానుగావడమే అసిపదము - యివ్విధంబున నాదబిందు కళలు న్ను, యిడపింగళ, సుషుమ్న మొదలగు స్వరములను దెలిసి - బిం దువయను పాపమీాదను - మనోనేత్రముచేత నిరంతరము రెప్ప పాటు లేనివాడవై - కనుపాపలో తళాయించుచున్న కళను జూ

చుచు - అదియునీవై, బహిరాంతరంబుల ప్రకాశింపుచుంటివేని స్వయంజ్యోతి రూపంబున సర్వదేహేంద్రియాది ప్రపంచంబునీవయి న్ని. నీవుగాక నీకన్యంబు లేక ప్రకాశింపుచుందువని చెప్పఁబడం బడినిట్లనియె.

## క్షరాక్షరవిషయము.

కం॥ అగుపడునవియు నశించ । దగుమిగిలిన వస్తువేదో తె ల్కిఁంచియునా । భగవస్వరూపమందున । తెగువను వసియింపుదు నెను ధీజనవినుతా. కం॥ క్షరమనలోకములగున । క్షరమనగాన చలుబయలు జగతీస్థలిలో । స్థిరమస్థిరముల రెంటిని । గురు తెఱుఁగు మటంచుబల్కెఁ గుండలినాథా. సీ॥ వడిసముద్రమునందు బడి యీదినట్లుండు మాయసంసారంబు మానుమాను । వలనుజిక్కిన లేడి వలెభీతి నొందించు వనితవివాహంబు వలదువలదు । బురద లోబడిపంది పొరలాడువిధమగు వెలదులకూటంబు విడువువిడువు। విపినమందుజరించు వెఱ్ఱిచంద మొనర్చు పుత్రధనార్జిత బుద్ధివదలు। గట్టిపెణపరమైన పగ్గముల చేత । గట్టిపడద్రోయుమతముల గొట్టు గొట్టు । పుట్టుమర్గుణకాండము నెట్టునెట్టు । మనుచువినుపించె సదయుఁడై ఫణివరేణ్య. గీ॥ యిన్నివిషయంబులోన గూడియున్న వేళ । లన్నియునుపొందు కొనుచున్ననాత్మలోన । నిన్నియును గూడ లేదని యేటివృత్తి । నాచరింపంగనగునని నాదిశేష. గీ॥ కర్మజేసి రేని కడతేరలేరనె । జేయకున్నగతులు డాయవనెను । జే సిచేయనట్టి చర్యపొందండనె । సుఖమొనంగుమయ్య సుబ్బరాయ.

కం॥ చోరత్వముగలదానితో । జారత్వముజేసిదాని సారము లాగే । ధీరుడుము క్తికిముఖ్యధి । కారుండనెనుబ్బరాయ కరుణా

భరణా. కం॥ రంగులుగలదానినితన । చంగటికినిజారదీసి జా
ణుండైతే । వ్రెంగుండంజేసెటిపా । కంగనునవె సుబ్బరాయ క
రుణాభరణా. శ్లేషార్థము—మనస్సునని యర్థము. కం॥ స్త్రీ
కొంగియుండవలరా । బోకునుసాధించిమేలు బొందగవలెరా । నా
కేమనుచున్ననుయవి । వేకేననెసుబ్బరాయ విశ్వములోనన్. కం॥
స్త్రీనివిడనాడకుండిన । వానిసమంబెవరుగారు వసుమతిలోనన్ ।
జ్ఞానులకెల్లను యుత్తమ । జ్ఞానుండనెసుబ్బరాయ కరుణాభరణా.

అర్థము—స్త్రీయనగా ముక్తికాంత. కం॥ ఎంచనశక్యపు
మాయను । దెంచుటకై పుడమిలోన తేజంబలరన్ । పంచీకర
ణంబునుబో । ధించెదననెసుబ్బరాయ ధీజనవినుతా.

## పంచీకరణము.

కం॥ లేదన్నదియున్నదనే । దేదోగనిదానియందు తేజములర
గా । పాదుకొనెనాల్గుభూతము । లీధరణినటంచుబలికె నినసమతే
జా. కం॥ పవనంబనలంబుదకము । భువియునివేనాలుగైన భూ
తములనగా । యివియునొకటొకటిగూడుచు । భువినిరువైయైన
టనెను భుజగశ్రేష్ఠా. కం॥ ఆకాశార్థముజ్ఞాతా । నాకాశము వా
యువునరి యలరెమంబై । యాకాశమగ్నిగూడిన । శ్రీకరమగు
బుద్ధియనుచు జెప్పెఫణీంద్రా. కం॥ ఆకాశముజలమొనరిక ।
శ్రీకటముగ చిత్తమయ్యె పరికింపంగా । నాకాశము పృథివిస్థలి
యేకంబైనహాముగలిగె నినసమతేజా. కం॥ బవనంబర్ధము వ్యాన
ము । పవనమునభమందుగలియు బడినసమానం । పవనంబగ్ని బె
నంగిన । భువినియుదానంబటనెను భుజగపరేణ్యా. కం॥ పవన
ము జలమునజేరగ । వివరమునసపానమయ్యె విశ్వంభరలో । పవ
నముభువనముగూడిన । జవమునప్రాణంబటనెను సాహస్రఫణా.

పంచపాదిగీతము॥ అగ్నిలోనర్థమునచక్షువయ్యెనగ్ని । గగనము నుగూడ శ్రోత్రంబుగలిగెనగ్ని । వాయువలరినత్వక్కయైబరగు న గ్ని । జలముకూడిక జిహ్వాగాదలపవలయు । జేసెనాఘ్రాణము ను పృధ్విమాసుకేంద్ర. గీ॥ శబ్దస్పర్శంబు రూపరసంబుగంధ । ములనుగల్పించె జలతత్వములనుగగన । మాదిభూతంబులనుగూడి మహితన్వృత్తి । ననుచునచియించె గురునరుండనఘచరితా॥ గీ॥ వాక్కుపాణిపాదపాయుపస్థలునభ । మాదిభూతములను పృధివిద గల । గలుగబజెనట్లంచు ఘనుడునకాక్షిించె । సుఖమొసంగుమ య్య సుబ్బరాయ. సీ॥ జ్ఞాతసహస్రా కమలంబుననుజేరి య న్నిటికాధారమై జెలంగు । కంఠమందునమనస్సంటి సంకల్పించు బుద్ధికోరుచునుండు ముఖమునుండి । చిత్తంబునాభిని జేరిచింతిలు చుండు హృదియహంకారమై మదముబెంచు । నాభియందున స మానము జేరి వచనముజేయుచుండును వ్యానవాయువెన్న । స ర్వాంగములయందు సంచరించును దానవాయువు కంఠమునొదల కుండి । వింతపల్కులుపల్కును ప్రాణవాయువు నాధారమున నుండి హంసరూప । మగుచుదిరుగుచుండు మహినియపానంబు । గర్భమందుజేరి కల్మషమును । వెళ్లద్రోయుచుండు వేగిరంబునన నె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ క్షితిశ్రోత్రము వి నంగ జేయునుచెవులచే త్వక్కుచర్మంబౌచు తగులుదెల్పు । చ క్షురూపముదెల్పు జిహ్వయురుచిదెల్పు వాసనఘ్రాణంబు పడిని దెల్పు । వాక్కుపల్కునుదెల్పు పాణిభూస్థలిని యివ్వడమును యందుకోవడము దెల్పు । పాదముల్గమనాది పద్ధతిదెల్పును శుక్లమూత్రమిడుచుచుండుపాయు । పస్థములముద్రోయబడునిట్లు తత్వము । లిరువదైదుగూడి ధరనుదేహ । జాలమందునటన జరి

గించునని జెప్పె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. గీ॥ తత్వ ములు యిర్వదైదను దనరిస్థూల । తనువుయగు మొదలైనభూ తములుజ్ఞాత । చిత్తమహాములవిడనాడ క్షితినిమిగులు । తత్వము లుసూక్ష్మ దేహమైనగు ఫణీంద్ర. సీ॥ జ్ఞాతచిత్తం బహంకారం బులునుగూడి కారణదేహంబు గణనకెక్క । ధరస్థూలమునకు నేత్ర స్థానముజాగ్రత్త రాజసగుణ మకారంబుగాంచ । సూక్ష్మముకార మచ్చుగకల సాత్వికగుణము కంఠస్థానమునజెలంగు । కారణంబున కు మకారంబుహృదయము గుణముతమంబొచు ఘనతనొందు । సాంఖ్యులయమునిందు జప్పదలంచెన । నట్టిభూతమందు నట్టితత్వ। మంకురించబడెను యటులనేసర్దంగ । నొకటి నిలుచుననియె ను రగరాజ. కం॥ భూవలయంబుననాయొక । టేవివిధజగంబులైన దెన్నగయెరుకై । శ్రీవిశ్వబ్రహ్మంబదె । పోవిన పూర్వాపరముల బొందెఫణీంద్ర. సీ॥ బ్రహ్మమైతినటంచు బల్క వచ్చునుగాని బ్ర హ్మత్వమునుపొంద బడుటకల్ల । వేదముల్ యెన్నైన ఫేయవచ్చును గాని మొదటియంశంబైన విధముశక్క । జ్ఞానశాస్త్రార్థముల్ గని జెప్పవచ్చును నిశ్చయజ్ఞానంబు నిలుచుటరుదు । మంత్రసాధనలం బు మరిగవచ్చునుగాని మానసభ్రమకోయు మాటటక్కు । కారి ణాచార్యులను జేరిజ్ఞానమరసి । పూర్ణకరుణానుదయచేయు బోధ దెలిసి । ప్రకటమగుమాయ గోసివేయకనుగాని । యాత్మస్వాధీన పడదనె యాదిశేష.

## హంసతత్వోపదేశము.

గీ॥ అవనియందేదియునుగాని దచలబయలు । దానిదెలిసి ప్ర పంచంబుమానినేను । లేననడిచిత్తవృత్తిని బూననదియె । నిర్వికల్పంబ్రహ్మయంబనను గడునధిప. గీ॥ అట్టిపూర్ణసమాధి మనోని

లముల। చలనముడుగకగాని గోచరముగాదు। గానవందుకు బిం
దునిల్కడయుముందు। గలుగకనుగానిగాదనె ఖగవరారి. కం॥
పవనాశ్వాసూఢుండై। భువినెల్లెడలను జరించుపురుషుడు బయ
లఁ। దవిలియు రుచిమరగినచో। పవనముమనముచట నిలువబడు
ననెవధిపా. సీ॥ అనిశంబు పద్మాసనాసీనుఁడై చూపులమరంగ
నాసికాగ్రమునిల్పి। యింద్రియంబులనెల్ల నిట్టట్టుపోనీకమది
చేత దిరముగాకుదియబట్టి। ప్రాణాదిదశవిధ పవనంబులను వికా
రములంటకుండ చొక్కముగనునిచి। కామరాగాది సంకల్పవర్జన
ముగా స్వాంతంబుచరసినిశ్చలము జేసి। ననిలమానసములతోడ హం
సమంత్ర। మమరగూర్చిజపించుచు సమగసముగ। హృదయసభ
మున బిందువుగదలనీక। నాదకళలనుగనుమనె నాడిశేష. కం॥
ధరణిహాకారము బ్రహ్మం। బరయసకారంబు యీప్రపంచంబని
గు। త్రైపగవలెమధ్యబిందా। యిరుపార్టికికూడలనియె నినసమ
తేజా. కం॥ ఉశ్వాసంబుహాకారము। నిశ్వాసంబిలసకార మీ
రెండుగన। న్నైస్వానుభూతినంటునె। యూస్వస్థానంబెచూల మ
నియెనహీంద్రా. కం॥ ప్రణవమునాదమనందగు। ప్రణవాగ్ర
మునందువెలుగ బడునదిబిందా। ప్రణవముబిందువునకులో। గ
నుపడు నదికళయటనెను కారుణ్యనిధీ. కం॥ పురుషుండుహాకా
రంబగు। ధరప్రకృతిసకారమయ్యె తెలుపగన। య్యెగు పురిగూ
డీకబిందువు। గురుతెరుగుమటంచుబలికె కుండలినాధా. గీ॥ ఇ
టులమూడైనవస్తువు యిహామునందు। హంసయని జీవుడని.నామ
మలరిమనసు। ప్రాణవాయువునకును స్వాధీనుడగుచు। లోకమున
పొందెననె దందశూకవర్యా. వచనము. ఇట్లుహాకారరూపకుం
డైన నిర్వికారునకు - సకారరూపంబగు ప్రకృతికిమించి - సంసా

రంబు ప్రకాశింపంజాల దట్లగుటవలన హకారరూపుండగు ఆత్ముం
డు - సకారమనుశక్తి నిధరించి నందువల్ల హసుండనంబరగిన - జీ
వుండు దేహంబులం బ్రవేశించి - వివిధేంద్రియప్రాణ మనోయు
క్తుండై - పంజరమునజిక్కి - పులుగుచందంబున వెడలనుపాయం
బుగానక - బహువిధభోగంబు లనుభవింపుచు - బ్రహ్మాదిస్తంభ
పర్యంత సర్వదేహంబులందున - హృదయకమలంబధిష్టించి యుం
డనందు పూర్వదళంబున పుణ్యమతియు - ఆగ్నేయదళంబున ని
ద్రాలస్యములును - దక్షిణమున క్రూరబుద్ధియు - నైఋతిని పా
పబుద్ధియు - పశ్చిమంబున క్రీడయు - వాయువ్యమున గమనము
ను - ఉత్తరమున రతిప్రీతియు - యీశాన్యంబున నిధానబుద్ధి
యు -మధ్యంబున వైరాగ్యంబును - కేసరంబుల జాగ్రత్త - కర్ని
కయందుఅనగా మధ్యయందున స్వప్నంబును డింప యంసుసుషు
ప్తియు - యెప్పుడు పద్మత్యాగియగునో నాదంబులీనమై - ఆధా
రాది బ్రహ్మరంధ్రపర్యంతము - శుద్ధస్ఫటికసంకాశంబై యొప్పు- న
ట్టిహంసస్వరూపుడా ధారచక్రంబున గణపతికి ఆరువందలును - స్వా
ధిష్ఠానము నబ్రహ్మకు ఆరువేలును - మణిపూరకమున విష్ణువునకు ఆ
రువేలును - అనాహతంబున రుద్రునకు ఆరువేలును - విశుద్ధంబున
జీవునకు వేయియును - ఆగ్నేయంబున పరబ్రహ్మకు వేయియును
సహస్రారంబునగురుస్వామికి వేయియును - యీవంతున అజపమం
త్రముపై యాసనముల ముద్రలచేతను సమర్పించుచు - రేచకమున
సకారమును - పూరకమున హకారమును - కుంభకమందు ఆత్మ
బింబమును జేర్చి - నాదబిందుకళలజూచుచుండ - సంతతపరంబై
న పరిపూర్ణకళ ప్రజ్వరిల్లి - తనయందైక్యపరచునని చెప్పి మరియు
ట్లనియె. రేచకమనగా శ్వాసము వెలుపలికి విడుచుట-పూరకమనగా

శ్వాసములో పలికిగొనుట. కుంభకమనగా శ్వాసముభూమిమధ్యస్థాన మున నిలుపుట. ఆధారస్థానమనగా సహస్రారమని తెలియవలెను.

షడ్విధసమాధులవివరము.

గీ॥ దేవమానవస్థావరతిర్యగాది । సర్వదగములు నాయందు జ లగిబొలియు । నంమకువిలక్షణత్వమై తెలివి । నేననుచుపొందు మననూ ఫణీంద్రఘనత. ఇదే బాహ్యదృశ్యానువిద్ధసవికల్పక స మాధి. గీ॥ శైవవైష్ణవాది సర్వమతంబుల । నామసముదయంబు నాకుగలుగ । దంమలకువిలక్షణంబైన బ్రహ్మంబు । నేనటంచు పొందుమ నన్నహీంద్రే. ఇదే బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధి. గీ॥ ధరణికామాదులుదయించు తీరినివాటి । పరిహరింపుచునివి వికల్పంబటంచు । నెరిగియుంకుకు పరముగా నెరుగబడిన । బ్రహ్మ మును పొందుమ నయ్య పన్నగేంద్ర. ఇదేఅంతర్దృశ్యానువిద్ధస వికల్పకసమాధి. గీ॥ అంతరమునగల్గు నఖిలమారారాగాది । వ స్తునామసమితివర్ణనీయ । మేనుగానుయుంకు కితరమా బ్రహ్మము । నేనటనుచు నెరుగమ నె ఫణీశ. ఇదేఅంతర్శబ్దానువిద్ధసవికల్పకస మాధి. గీ॥ పైనవినబల్కునలువిధ ప్రకరణములు । పొందినటు లైన నీకన్యముండవేవి దోచు నొక వేళనీటిలో దాచుఘటము । రీతినగణింపదగునని శ్రీఫణీంద్ర. ఇదే బాహ్యనిర్వికల్పకసమాధి. గీ॥ వినుము పై చెప్పుసృత్తు లేవియును లేక । పరమపదమైన పరిపూ ర్ణబయలు దెలిసి । యందుగలిసియు శాశ్వతానందపదవి । నొం దుమనిబల్కె దర్వీకరేంద్రఘనత. ఇదేఅంతర్నిర్వికల్పకసమాధి సీ॥ సంశయంబులు వీడజాలనివానికి బ్రహ్మత్వమునుపొందబడదు గడిమి - ఆశవీడుచుభ్రమకోసివేయకగాని ముక్తిమార్గముగాంచ బోడునరుడు - సంచితార్థములెల్ల ద్రుంచివేయకగాని యుచవా

హానుడుమన్నించడలని। మనసుత్యాగించని మనుజుడేనాటికి పూర్ణ భావంబును బొందలేడు । మూడుమంత్రములను మూలంబెరుంగక । ఐక్యభాటు గాంచడవనిలోన । నెరుగుమనుచుబలికె కరుణాంతరంగుడై । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. గీ॥ మనిషికిని మించునది లేదు వినుముమహిని । సర్వసాధ్యమసాధ్యముల్ నిర్వహించ । గలడుగావున మదోృధఘట్టిగాను । మనముసందుంచి సాధించమనె ఫణీంద్ర. గీ॥ మంత్రజపహోమనీతి నీమములు గావు। గనకయుక్తులుయోగముల్ గావుయోగ । సాధనలుగావు సజ్జన సమ్మతంబు । నైనబోధను వినుపింతుననె ఫణీంద్ర.

పంచబంధవిముక్తి.

గీ॥ పూర్ణుడవుగాన నీకేడపూర్వజన్మ । నీకుజన్మాదులిక లేవు నిశ్చయముగ । వివిధయోనిముఖంబు లన్వేడల లేవు । లేరుతలిదంద్రులనె కుండ లేంద్రఘనత. సీ॥ పంచభూతంబుల పట్టునీకును లేదు యరయపూర్ణుడవెట్టు లనినవినుము । కలలోనగనుపించు బలురూపములపూర్వ జన్మంబుజెపుమన్న జెప్పగలవె । యండమావులనీళ్లయందు రుచ్యారుచ్య భేదంబులరయంగ బోధయగునె । పూర్వజన్మంబట్టి పోహణేవనిగాంచు వడిపునర్భవమదివట్టిమాట । లన్నిభూతాంశంబులన్ని భూతంబులజేరంగపైగాను క్షితితలమున। యేమినిలుచునన్న నెరుకయేనిలిచెను । అట్టిశుద్ధమెరుక యచలునందు । జెందిపోయెపునహా జన్మమే లేదనె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. ఉ॥ ప్రాణముఘాలిలోగలిసె పట్టుగళబ్దము వ్యోమమందుననా । త్రాణనుత్వుత్తు తేజమున దాగెరసాదులు నీటజేరెనీ। శోణితలంబునన్ధనువు జొప్పడెనిర్భయులందు మేలిమా । జ్ఞానము నిల్చెనంచు కృపగల్గివచించెనహీంద్ర చంద్రమా. సీ॥ తలిదంద్రి

వలనను గలిగితినంచువా తలిదండ్రులేలేరు దరచిచూడ । వారుని
న్నెరిగియువారి నీవెరిగియుపుట్టింపబడలేదు పుట్టలేదు । గలిగితి
మనునదిగలిగించితిమనేది వట్టిమాటలటంచు పరగనమ్ము । మాయ
ప్రపంచంబు జేయుటకైయొక్క । టడ్డంబుబెట్టుక నరుగు దెంచి ।
యటులనేయేగి నటులుండునరసిజూడ । వచ్చినదిలేదు పోవుటేవట్టి
మాట । లన్నియునుజూడ నిర్భయులనిదలంచ । యేమియెచ్చోట
లేదని నిలఫణీశ. గీ॥ యోనిసంభవమనుమాట లేనిపోని । భ్రా
మికమెగాని యఖిలుమరేమిలేదు । తల్లిదండ్రులేలేకున్న తనకు
యోని । సంభవంబెక్కడనిబల్కె సర్పరాజ. గీ॥ నీవుముందు
మరచు నిజరూపముచజేర । పలుకునభమునందుగలిసిపోవు । పైన
పంచభూతభ్రాంతితో పనియేమి । సుఖముగాంచుమనెను సుబ్బ
రాయ.

## ఐక్యసంధానము.

సీ॥ తప్పుడహంకార దర్పంబడంగును నేను నాదనుమాటమాను
మాను । బేహూషిచిత్తంబు బెంపారు సకలంబు తెలివిచే బయలు
గాదలచుదలచు । కోరుచుండెడిబుద్ధి గోల్పడుచుండును పూర్ణభా
వంబును పొందుపొందు।గెలుకుచుండుమనంబు పొలుపారుతేణమున
నిజరూపమందున నిలువునిలువు । పరనమొనరించు యీాయుత్తబ
ట్టబయలు । యేమిలేదనిసర్వదా యెంచుయెంచు । అట్టిమహ
దాంశమందున నైక్యపడిన । సముడునీకెవ్వడనిబల్కె సర్పరాజ.

సీ॥ క్షితిలోనకలనుదోచే శరీరాలు యేలాగోనాలాగుగా ల
క్ష్యముంచు । సరవిమూలములేని గుర్తెరుగుశరీర మేమిలేదంచు
ను భూమిదనరు । త్రాడుపామను భ్రాంతివీడుటకైఘట్టిగాను పరీ
క్షించ బూనవలయు । నిజముగాంచను భ్రమనిల్వనట్లుగ నాత్మ

నెరుగ ప్రపంచంబు మరుగుపడును । గాన దెలియుమదిగో కలకా
ల మొకరీతి । చలనవృత్తిలేక చలగుచున్న । నీస్వరూపమందు ని
ల్వమంచుపచించె సుఖమొసంగుమయ్య సుబ్బరాయ. సీ॥ చా
వుపుట్టుకలేని సంతతానందంబు నీనిజరూపంబునిశ్చయముగ । సు
ఖదుఃఖములులేని సుందరరూపంబు నీనిజరూపంబు నిశ్చయముగ।
బంధమోక్షంబులు జెందనట్టిఘనంబు నీనిజరూపంబు నిశ్చయము
గ । సాధువానంద్యమైన శాశ్వతానందంబు నీనిజరూపంబు నిశ్చయ
ముగ । నామరూపంబులేని ఘనాఘనంబు । ముప్పుర్రయ్యలకెల్లను
మూలమైన । పరమవస్తువు నీస్వరూపంబుగాన । నైక్యభావంబు
గనుమనెనాదిశేష. గీ॥ యెందుకిన్నిమాటలతోటి యేమిఫల
ము । నేనుజూపించుగురుతులో నీకుతెలివి । గలివి దివ్యరూపుం
డవై నిలుతువేని । అంతయును నీవటనెను యనంతఘనత. సీ॥
మొందెందుచూచిన సందులేకనుయున్నదిటుజూడు । మిటుజూడు
మిదియునిజము । కదలక మెదలక చదరకుండను యున్నదిటు
జూడు మిటుజూడు మిదియునిజము । మాయజాలంబుల మహిమ
లంటకయున్నదిటుజూడు మిటుజూడు మిదినిజంబు । వడిసర్వకాల
సర్వావస్థలే లేవు యిటుజూడుమిటుజూడు మిదినిజంబు। ఇట్టియుపల
తేజమొపడేనిపొందిన । జన్మలేదు వాడుశాశ్వతుండు । వత్యమిది
యటంచు చక్కగా వినబల్కె । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

## ముక్తిసందర్శనఫలము.

సీ॥ అవనియందామహదానంద వార్ధిలో త్రిగుణ రూపిణిజడా
త్మికయలోక । ములకాది పెక్కుచింతలతోట ఖ ర్వస్థానముజాల
మైనయనాదిమాయ । కల్పనమాశిఖకర్పూరముల భాతిగలశియ
లయ మొందదలచెనేని । యట్టిమహానీయుడ! ముత పానంబుజేశి

నవాడెను శ్రీగీతలమున । వానిసమమె వానిగానమయిదిగాక । వానిపుణ్యపాపవర్గవాని । సత్కరించుమరి తిరస్కరించెడివారి । నెందుననుచుబనికె సుందరాంగ. కం॥ మాయయనుమెరుక భూతము - హాయిగనచలంబులోననైక్యముకాగా - ప్రాయుఁగు భర్తనుంగని - స్త్రీయేవిధముననను సంతశించునెయటులన్. కం॥ మనశిచ్చిగలశిపెనుగుచు - ఘనసౌఖ్యాంబుధినిదేలుచును వెనుకటిచిం - తనలెల్లమరచునిజమిది - వినుమాయనిబల్కెనయ్య విషధరచంద్రా. సీ॥ అటులనెందెనుయోగిసటనలక్ష్యతిమగునిదిగాకధరణిలోనెంచిజూడ - తనతల్లిదండ్రులు తాతల్లిదండ్రులు తనపుత్రిపుత్రులు తగినహితుల - కటుయేడుతరముల కిటుయేడుతరములకమ్మహాసీయుచేగతులుగలిగి - తరియింతురిదిజడధారులకను భవమైన సమ్మకమనిమదిదలంచు - మిటులదెలియకజనములీ యిహములోన పెక్కువిధతోవలను దొక్కిదిక్కుదెసను - గానకుందురుయవియేమి ఘనమెనంగు - ఫలితమేయచలమని జెప్పె వన్నగేంద్రా. కం॥ ఇదిసత్యమిదియునిత్యం - బిదెమోక్షము సత్యలోక మిదె వైకుంఠం - బిదికైలాసముదలపగ - నిదెపరమపదంబటనెను యిలను ఫణీంద్ర. గీ॥ వారిజాసనుండు వారిజాక్షుండును - మేరుడాదిధీరవరులు - కోరికొల్వబడిన గొప్పవస్తువుయని - జెప్పెగురువరుండు సర్పరాజ. కం॥ ఇంతకుమిగిలినధర్మం - బెంతయువెదుకగనులేదు యీలోకమునన్ - భ్రాంతివిడనాడినీను - స్వాంతమునన్దెలియుమనెను సాహస్రఫణా. గీ॥ శైవవైష్ణవాది సకలమతంబుల - భాటలెటులదెలుప బడినతుదకు - నిటకువచ్చితీరునిది నిశ్చయంబన - సుఖమెనంగుమయ్య సుబ్బరాయ. గీ॥ రహానుమామహేశ్వరానుగ్రహమువల్ల - పరమశీగురు వరుకరు

ణవల్ల - నేరచించినట్టి యాగ్రంథమునునీకు - నప్పగించినాడ న
హిశు లేంద్ర.

## ఆశ్వాసాంతము.

సీ॥ ప్రాపరంధామ నేనుర్వి లోకమునను ముఖుండ నిపించుకొన గ్రా
యుపనియుగాను । నన్నుంచినైనదా ఎన్నటికిని తాము బలికించి
నటుల నే బలికినాడ । యూహాపోహాలు నీకె యొప్పియుండును గాన
ఏమి వ్రాయించితో నెరుకబడదు । యెన్ని తప్పులు యున్న నేమిలో
షములున్న భరియించినాయందు కరుణయుంచి । గావిబ్రోచుట
కును యాచించినాడను । దెరవు వేరు లేదు పరమపురుష । కాయతీ
గకేమి కష్టమైదోచును । నిండుసుఖమొసంగు కుండలెంద్ర.

గీ॥ యిట్టి గ్రంథమందు నెట్టిలోషములున్న । బుధులు సమ్మతిం
చ పృథివియందు । యంజలిదును పరమహర్షంబు చేతను । నన్ను
నేలవలయు పన్నగేంద్ర. సీ॥ ఈపద్యసముదాయ మెవరు పఠిం
చినవారికి హరుడిచ్చు వైభవంబు । యీదివ్యచారిత్ర మెవ్వరైన వి
నినను వారి పాపంబులు పారిపోవు । నీజ్ఞానశాస్త్రంబు నెవ్వరైన వ్రా
సినవారల కానంద వార్ధిగలుగు । నీగ్రంథతాత్పర్య మెవరెరింగించిన
నాయురారోగ్యంబు లతిశయిల్లు । నిందు విషయగణము నెవరు సా
ధించిన । కాలధర్మములను చాల దెలిసి । యొప్పుచుందురనుచు జె
ప్పెనుకదు ప్రేమ । సుఖమొసంగుమయ్య సుబ్బరాయ.

కం॥ వ్రాలాదప్పులుసంభ్రభలు । చాలంగల వేనుశబ్ద సంగతు లె
రుగర । గేలించెట్టకదిట్టక । పోలంగా దిద్దరయ్య బుధజనులారా.
కం॥ ఈపద్యసముదయముగన నాప ద్మహితుండు చంద్రుడా తారకు
లున్ ।జూపట్టు వరకు హరుకృప । చే ప్రబలగవలయు కదు ప్రసిద్ధిగవు
డమిన్.

ఉత్సాహవృత్తము-శ్రీయుమామహేశ్వరాజ్ఞ చేతఁ బ్రసిద్ధిగా ।
వ్రాయఁబూనుకొన్న సుబ్బరాయపద్యవైఖరీ ।
శ్రేయమైన భూమినాది శేషుకర్పణంబుగా ।
జేయ వ్రాసినాఁడ హెచ్చు శ్రీలొసంగి ప్రోవఁగన్ ।

గద్య.

ఇది శ్రీయుమామహేశ్వ రానుగ్రహంబున - శ్రీమదఖండ సచ్చి
దానంద స్వానుభవాతీతుండగు హనుమునిగిరి శివరామబ్ర
హ్మేంద్ర గురుస్వాముల వారుపదేశించిన సర్వంబును - వి
శ్వకర్మవంశపయః పారావారరాకా సుధాకరుండగు
పోకూరుసుబ్బరాయా చార్యతనూభవ - సుబ్బరా
యాభిధానుండాది శేషాగ్పణంబుగా రచియిం
పంబడిన సుబ్బరాయ పద్యంబులను మా
నవధర్మప్రదీపికయందు జ్ఞానోదయా
ది సర్వధర్మంబులుంగల పరమపు
రుషార్థ సంగ్రహంబగు ద్వితీ
యాశ్వాసము
సమాప్తము.



యీ గ్రంథముయొక్క మొదటిసంపుటములో గృహవాస్తు జలవాస్తు, శల్యవాస్తులున్ను, కాలమానస్థితులున్ను, ప్రశ్నలున్ను బాల్యరక్షకోపయుక్తములగు కొన్నియంత్రములున్ను, ముహూర్తప్రకరణమున్ను, వైద్యవిషయములున్ను గలిగి పద్యరూపకముగా నున్నది.



శ్రీరస్తు.

## సుమతిపద్యంబులను-యచలమార్గము.

శ్రీగణనాథునిభవునిస । దాగౌరినిశిరిని చక్రధారునిమదిలో । నేగొలుచుచుగురుకరుణను । వేగమెరచియింతుజ్ఞానవిషయము సుమతీ ॥౨॥ హనుమునిగిరి వాసునిగని । ఘనమదితో పూజజేశి కడువినయమున । న్ననఘా కడతేరెడు దెర । వును దెల్పు మటన్న నిటుల నుడివెనుసుమతీ ॥౩॥ సత్యంబు జనవిరుద్ధం । బత్యంతంబైన తిక్తమమరనృతమే । సత్యంబై భువిజనులక । గత్యంబై యొప్పుచుండు గదరాసుమతీ ॥౪॥ నిజమైన మాటనమ్మరు । భజియింపరు శంకజేయ బడుదురు ధరణిన్ । రజమెంత గప్పియున్నను । భజియింపరె రత్నస్థితిని ప్రాజ్ఞులుసుమతీ ॥౫॥ కల్లనిజంబులు రెండును । ఎల్లజనావళులుజేరి యీగొప్పతెరం । గెల్లగమనింప నంతత ముల్లంబున నెరుకబడుచు నుండును సుమతీ ॥౬॥ ముట్టెపుట్టువు మూలము । ముట్టుకు మూలంబులేదు భువనంబునయా । ముట్టునయంటక నిపుడా । ముట్టును నట్టెటగల్ప మోక్షము సుమతీ ॥౭॥ స్త్రీకోర్కెవలన మనుజులు । యాకోరిక ననుసరించి యమ్మృతజగమా । లోకంబాయెను గావున । నాకోరిక చాతగడువ నైరిలసుమతీ ॥౮॥ మదిసంకల్పము లుడిగిన । నధికారనిపించు నాతడన ఘూత్మండౌ । మదిసంకల్పము లుడుగక । పృధివీస్థలి నెట్లువాడు పెద్దగు సుమతీ ॥౯॥ కులమెచ్చుతగ్గు లెంచుచు । పలువిధముల బలుకువాడు పామరుడనుమీ । ఇలకల నిభమని దెలియుము । కులమంతే ననుచు దెలుసుకోదగు సుమతీ ॥౧౦॥ మతములను మేలుగలవని । మతిలోభులు బలుకుచుండు మార్గములువృధా । మతవిద్వేషణ జేయక । గతిగలదా ఎంతవాని కైనను సుమతీ ॥౧౧॥ పు

ట్టించు దేవు నెరుగక । మట్టికి రాళ్లకును పూజ మరిమరి జేయన్ ।
గట్టెక్క బడు నెవాటితో వట్టిదియని యట్టియాశ వదలుము సు
మతీ ॥౧౨॥ ఘనముగ దదేకనిష్ఠా । ఘనులై శిలలకును మ్రొక్క
కడగనిరహహా । తనలో వెలుగు మహాత్ముని । గనజాలరు కడను
యెట్లు గందురు సుమతీ ॥౧౩॥ దేవార్చనలు యొనర్చుచు ; నైవే
ద్యం బివ్వబడిన నైవేద్యంబే । దేవుండ్లు యారగించిరె । నీవా
యోచనను జేయనీతో సుమతీ ॥౧౪॥ పొట్టకొరకెల్ల జెప్పెడికట్టుకథ
ల్యనివెరింగి కడుసమృద్ధి । నష్టసుఖంబుల దొలగ । నైగెట్టి రఘు
ట్టని జేరగోరుము సుమతీ ॥౧౫॥ యోగాభ్యాసము మిక్కిలి । భో
గంబని బల్కువారి బుద్ధిచతుర్యం । బేగాక నేమిఫలితము। యో
గాభ్యాసంబు ఫలితమురివ్వని సుమతీ ॥౧౬॥ యాత్రాపేక్షను జనుల
హారాత్రములను నడచుబాధ రాజిల్లునయా । సూత్రార్థ మెరు
గకున్నను । గాత్రాయాత్రయును నల్పఘనమురసుమతీ ॥౧౭॥ వై
కుంఠంబన వేరా । త్రైకూటస్థాన మెపుడు తాగనుగొనుటే। వై
కుంఠమనిరి మిగులవి । వేకోత్తము లెల్లదెలియ వినరా సుమతీ ॥
౧౮॥ యనుదండ ననగనుమా । విమలత్వంబైనపదవి విడనాడు
చును । ఖ్యమనదగు జన్మకొచ్చులె । యమలోకము జేరెననుచు
ఎంచుము సుమతీ ॥౧౯॥ వుపవాసమనుచు జీవుని । తపియింపగ జే
యుదగను తత్వజ్ఞులు ఖ । ర్మపుస్థానమందు వీడులె । యుపవాస
మటంచుబలికి రుర్వని సుమతీ ॥౨౦॥ మడిమయిలాచారములన ।
పుడమిని దగియుండు వాటిపోవాణవినుమా । విడిస్థలము నెరిగి
పొందుటె । మడియాచారము లటంచు మదిగను సుమతీ ॥౨౧॥ ఖ
ర్మమున బుట్టుజంతువు । ఖర్మమున సమృద్ధి జెందు ఖర్మమునజడున్ ।
ఖర్మము నరులకు దేవత ఖర్మమె సుఖదుఃఖమనుచు గాంచుము సు
మతీ ॥౨౨॥ ఖర్మమె తల్లియు దండ్రియు ఖర్మమె తనతోడునీడ

దారాపుత్రుల్ ఖర్మమె కష్టసుఖంబులు ఖర్మమె తనకలిమిబలిమి గనరాసుమతీ ॥౨౩॥ ఖర్మమెదానముధర్మము ఖర్మమె కడుపుణ్య పాప గతిగలిగించన్ ఖర్మమె బంధముమోక్షము ఖర్మమయా జనన మరణకాండము సుమతీ ॥౨౪॥ పాకొమ్మును కాకొమ్మును మాకోత్వము డాకుడాను మరిగూడంగా లోకాలోకములగుచును యా ఖర్మమె వెలుగుననుచు ఎంచుము సుమతీ ॥౨౫॥ ఖర్మకు వెలుపల లోపల నిర్మలముగ విశ్వఖర్మ నెగడుధరిత్రిన్ ధర్మాధర్మము లెన్నుచు నర్మిలితోగాచునమ్మ హాత్ముడు సుమతీ ॥౨౬॥ క్షితివిశ్వబ్రహ్మముగన నతడేహరిహరులనంగ నతడేధాతౌ నతడేసురుడన పరుడన నతడే గ్రహరాశియనగ నలరును సుమతీ ॥ ౨౭॥ ధర్మము ఖర్మమణంచును ధర్మము పుణ్యంబు బెంచు దరిద్రము నొంచున్ ధర్మము ఘనము నొసంగును ధర్మమె సకలార్థములకు దక్షత సుమతీ ॥ ౨౮॥ గురుశేవజేయకున్నను పరతత్వపు భాటదెలియ బడదటు గానన్ గురుశేవనముఖ్యంబని స్థిరమగుమతితోటి భువిని దెలియుము సుమతీ ॥౨౯॥ గురువును మించినధర్మం బరయగనీపుడమిలోన నగుపడదెంచున్ గురుడేనిహపరసౌఖ్యము లెరిగించెటిప్రభువటంచు నెంచుము సుమతీ ॥౩౦॥ ఎరుకయిదిమరుపుఇదియని యెరుగుదురా పుడమిజనులు యెన్నండైనన్ గురువరుడుదప్పతక్కిన నరులకు సాధ్యంబుగాదు నమ్ముము సుమతీ ॥౩౧॥ ఎరుకమహాత్యం బెన్నను తరమేంద్రాదులకునైన తర్కింపంగా స్థిరమైయస్థిరమైపటు తరమైబ్రహ్మాండమైనదనిగను సుమతీ ॥౩౨॥ ఎరుకయనరెండువిధములు పరికింపగశుద్ధయెరుక భాటనియొకటా మరిమాయ ఎరుకయొకటని ధరవెలయునువాటి దెలిసిదనరుము సుమతీ ॥౩౩॥ జీవేశ్వరులన ఎరుకే భావాభావంబులనుచు ప్రబలినదెరుకే శ్రీవిభుడన్నను ఎరుకే యావాణీశ్వరుడనంగ యెరుకే సుమతీ ॥౩౪॥ ఎరుకపుట్టీవలావల

స్థిరమైయున్నట్టివాడు దేవుఁడనుచు గుర్తెరుగుము యొకతఁడాంబూలో నడుదెంచుచు సమయుచుండుననిగను సుమతీ ॥౩౫॥ లోకంబులన్నదెఱకే లోకేశులనంగనెరుకె లోకస్థులన్ లోకోత్తరులన్నదెరుకే గాకనువేరొకటిగాదు గాంచుము సుమతీ ॥౩౬॥ ఎరుకేజాగర స్వప్నము లెరుకేభవబంధమోక్ష మెరుకేపదవుల్ యెరుకే సుఖదుఃఖంబులు ఎరుకకు మించినది లేదు యిలలో సుమతీ ॥౩౭॥ మాయప్రభావము వినుమెం కాయకునీళ్లొచ్చు భంగిగాన్పించియులకాయను కరిమ్రింగినవిధ మైయ్యేలరునటంచు గనుముమహిలో సుమతీ ॥౩౮॥ వచ్చేరాకడనెరుగము వచ్చియు పోయ్యేటిపోక వకరికిగుర్తా హెచ్చువినోదం బదిబహు యశ్చరువురమా యగనుటకళివా సుమతీ ॥౩౯॥ కలలోవచ్చు వివిధతను వులుదెలివిన్ జెందనెటులబోయెను యుల్లే యిలయును ఇలగలసర్వం బులుమాయేనను చు దెలియుము కర్తను సుమతీ ॥౪౦॥ మాయే యండంబనునది మాయే పిండంబటంచు మహిదనరినదీ మాయే బ్రహ్మాండంబై భాయంబుగ ప్రబలుచుండు గదరాసుమతీ ॥౪౧॥ చూచునది మాయెయెదుటను దోచినదంతయును మాయెతోల్దొల్తనుదో యోచనలెల్లనుమాయే సూచనగా దెలిశియటుల జూడుము సుమతీ॥ ౪౨॥ మాయకుస్థానము మనసై జేయును మిథ్యాప్రపంచచేష్టలనెల్లాదాయంబేమో దెలియను భాయంబన వట్టిటక్కు గాగను సుమతీ ॥౪౩॥ కొట్టించను దిట్టించను పెట్టించను గట్టుబరచ ప్రేరణజేయన్ ఘట్టిదిబహుటక్కరిముడి కట్టెగదా మనసటంచుగాంచుము సుమతీ ॥౪౪॥ ఇప్పించను మెప్పించను రప్పించను గొప్ప జేయ రక్షణపరచన్ యొప్పించను చొప్పించను తప్పించను మానసమే ప్రభావము సుమతీ ॥౪౫॥ నిలుమన్ననుతృణమైనా నిలవుగదా మనసుఖగుణ నెళులఖవిధా తలపు ఎటొనటుల దిరుగునుకో

లిజనులకు మూలధనము గదరా సుమతీ ॥౪౬॥ వంశలవంశలదూ
కుసు చంకలుపట్టుచునుయుండు చాపల్యముతో సంకెకురాదెం
తైనా ఝుంకదురా రంకులాడి స్వాంతము సుమతీ ॥౪౭॥ వృన్న
ట్టుంఘనుయుండియు యెన్నండో నెటకో బోయి ఏతెంచునుయా
మన్నెలమారి మనన్నును గన్నదియెటువంటిజాణో గనరా సుమతీ
॥౪౮॥ మనసేసర్వజగంబులు మనసేజగములలో జరుగుమాయా న
టనల్ మనసేజీవసమూహము మనసేకారణముకార్య మన్నది సు
మతీ ॥౪౯॥ మనసేనీవును నేనును మనసేసకలంబులైన మాయోక్తు
లన్ మనస్సేసత్యము సత్యము మనసుకు మించినది లేదు మహిలో సు
మతీ ॥౫౦॥ మనసనిన మాయభూతము మనసున్నను సర్వములును
మసలుచునుండున్ ; మనసణగిన సవియన్నియు తనకంటే ముందె
యణగు తథ్యము సుమతీ ॥౫౧॥ మనసే జననంబన్నది మనసే ఖర్మ
ములుజేయ మరగినదెల్లా। మనసేచివరకు జూపగ ఘనదుఃఖము లో
ప్పజేయు గదరాసుమతీ ॥౫౨॥ పుట్టుటమునునదె దుఃఖము పుట్టుక
లో గర్భనరక మొకదుఃఖమగున్ । పుట్టిన మలమూత్రంబులు చు
ట్టునదే యొక్కదుఃఖ సూచనసుమతీ ॥౫౩॥ కినకులు కూనలు సం
ధులు ముసరులు మరి ముట్టుదోష ములు మొదలగు ఈ వసుధా
స్థలి గలబాధల వసియించుటె గొప్పదుఃఖ వారధి సుమతీ ॥౫౪॥
బాలత్వమొక్క దుఃఖము స్త్రీలకు లోబడుటయందు చెడుదుఃఖ
మగున్ । మా లిమిసంసారములో తూలడమే తరముగాని దుఃఖ
మునుమతీ ॥౫౫॥ బాలులుగలిగిన దుఃఖము బాలులు గలుగకను
యున్న బహుదుఃఖమగున్ । కాలము దీరెటివేళల చాలాదుఃఖం
బుచేత చడుదురు సుమతీ ॥౫౬॥ ఆశయను భ్రమస్వరూపము జేశె
నురా ఇంతగరి ప్రశిద్ధముగానా యాశే బహుపాపజాతిగ వాశిని
గనిపెట్టవచ్చు ఘనుఘను సుమతీ ॥౫౭॥ భ్రమయుహిమేమని యం

దును కమలభవుం డైనదెలియ గలడాభువిలో ఘనులెన్న వింపులే
నిది గనుపింపఁ జేయుననుచు గాంచుము సుమతీ ॥౫౮॥ లేనిది
గగనంబనగా దానికి నీలంపుదీప్తి దగునదిభ్రమయే గానామహి
మనెరుంగను మానవులకు నళవియగు నె మహిలో సుమతీ ॥౫౯॥
ధారుణిలోనను భ్రమవిధ మారయ బ్రబలేటి యెండమావులయం
దుఁ నీరుండునటులగన్పడు దారువుమానవునిరీతి దథ్యముసుమతీ॥
౬౦॥ తజసుప్తి గనులు వెండిగ నిజపరచును బ్రాముకంబు నేర్పు జె
లంగఁ భుజగా వేళమురజ్జువు కుజనింపఁ జేయుచుండు కుంభిని
సుమతీ ॥౬౧॥ యటువలె నిర్భయలందున స్ఫుటతరమగు లోకము
లుగ జూపట్టుటకు న్నటువంటి శక్తియనదగు మటుమాయంబౌను
నైజ మరయగసుమతీ ॥౬౨॥ భ్రమవీడును నిజమరయగ భ్రమవీ
డిన యపుడెలోక భ్రాంతియువీడుఁ విమలత్వంబులుమీాదట నమ
రత్వం బగుచునిలుచు ననిగనుసుమతీ ॥౬౩॥ భ్రమకే సర్వజగంబు
లు భ్రమకేగుర్తగునుగాని బయలుకుగుర్తా భ్రమకుబయల మి
తదూరము భ్రమకేబరిబాట్లులేదు బయలుకు సుమతీ ॥౬౪॥ బ
యలే పరాత్పరమనునది బయలే బ్రహ్మంబటంచు బలికెడిదెల్లా
బయలే మోక్షముగనుమా బయలే సత్పురుషులకు నివాసముసు
మతీ ॥౬౫॥ బయలే శుద్ధబ్రహ్మము బయలే బహిరాంతరములబ
రగినదెల్లఁ బయలాద్యంతములేనిది బయలేరా వీరధర్మమన్నది
సుమతీ ॥౬౬॥ బయలున పుట్టుటపెరుగుట బయలందే వియ్యబడు
ట భ్రమకేజెల్లుఁ బయలందు పుట్టుచావులు భయభ్రమణలు
జూడగలుగ బడునా సుమతీ ॥౬౭॥ బయలన్నదాత్మయేగద బయ
లాత్మలురెండుభేద పడవనిగనుమా బయలే యాత్మగునాత్మే బ
యలని స్థిరమదిని నమ్మవలయును సుమతీ ॥౬౮॥ బయలు బయల
న్న వెలుగే బయలనుచును దలపవలదు బయలుకులో నిర్భయలౌను

దానినెరుగుచు నియమంబున పొందువాడె నేర్పరిసుమతీ ॥౧౯॥ వ
కడే దేవుండంచుఁ బ్రకటంబుగ భూమిలోన బలెకెడిపలుకే యక
లంకమూర్తి నేనని సుకరస్థితి నెరిగియటుల జూడుము సుమతీ ॥౨౦॥
అందరు బ్రహ్మంబందితి మందురుయనవచ్చు నందరందను వశమా
సందియములుడుగు ఘనముఖు డెందరిలో నొకానొకండ నెంచుము
సుమతీ ॥౨౧॥ జ్ఞానాజ్ఞానము లనుచును పూనియులో కంబునందు
బొదలుచునుండుఁ జ్ఞానమన దైవపరమ జ్ఞానమునరపత్తనంబు గ
దరాసుమతీ ॥౨౨॥ జ్ఞానాజ్ఞానము వదలెడు జ్ఞానము ఏదియును గ
లదో యద్వితీపరిపూర్ణానంద మదేయచలము గానవివేకంబు
నొంది గనరాసుమతీ ॥౨౩॥ హారణమగు నన్నదేదో హారణము గా
దన్నదేదో యదిఏమిటిదో తరచగవలెనే యనియొక నరుడైనను
గమనముంచ నాయను సుమతీ ॥౨౪॥ జగమస్థిరమని దెలియక పొ
గరున పపలేనిభార్య పుత్రాదులతో తగుకాలమెల్ల గడుపుచు వ
గచెడిబోయెదరు యమునివద్దకు సుమతీ ॥౨౫॥ జనియించినపుడె
లోకము తోనగూర్చుకవచ్చిమరణ మొందంగానే క్షణమైన నిల్వ
దంచును ఘనమది దలపోయవలయు మనుజుడుసుమతీ ॥౨౬॥ కొ
ట్టిందు చోటపట్నము దట్టంబుగ నొప్పుచుండు తనపరికరముల్
చుట్టుకనెప్పుడు లేచునె వట్టిదయా యపుడుపట్నవైఖరి సుమ
తీ ॥౨౭॥ కనులకు గనుపడునంతయు ఘననిద్రజలంగువేళ గాన్పించ
కనె ట్లను బోవుననుచు దెలియుము జనవంద్యుండొకడు నిలుచు
జగమున సుమతీ ॥౨౮॥ సారములకు మొదటిది సంసారసుఖంబె
నటంచు సంతసపడుదురు సారమెరుంగని మనుజులు సారములకు
మొదటి దచలసాధన సుమతీ ॥౨౯॥ సంసారసాగరంబతి హీంసల
పుట్టిల్లు మిగులహీనంబా మోహాంశం బొకించు కైనను పాశించ
దు మొదలె దెలియ బడదది సుమతీ ॥౩౦॥ ఎరుకను జ నించిగదా

పరిపూర్ణంబిట్టిదంచు భావింపవలె న్నరుకను జన్మించినచో పర
తురయా స్త్రీలమీఁది మమతతో సుమతీ ॥౮౧॥ పప్పన్నము దిను
వేళల నొప్పెడుసంతసము కడుపు నొప్పెత్తంగా నవ్వెడు దెలిసియు
వెదుకుదు రప్పానమ్మైన త్రోవవనిలో సుమతీ ॥౮౨॥ కండకొవ్వు
వదలి జనములముందుని దర్శించలేక గర్వాంబుధికిఁ మిండలని
పించుకొంచును పండిరయానరకమునను బడువడిసుమతీ ॥౮౩॥ నే
నూనేననిబల్కుడు రేననగా నేమిమాట ఎవరదిగనుమా నేననెడి
దహంకారము దానికై కులగోత్రనీతి ధరలోసుమతీ ॥౮౪॥ యహా
మే జననంబన్నది యహామే ఖర్మంబులన్నదహామే జగ్గమా యహా
మేదారాపుత్రులు యహామే ఇహసౌఖ్యవర్గ మంతయుసుమతీ ॥
౮౫॥ యహామే జాగరస్స్వప్నం బహామేధర్మార్థకామ్య పద్ధతులెల్ల
న్నహామేసాలోకాదులు యహామే జన్మద్వయంబులనిగను సుమతీ॥
౮౬॥ స్వప్నమె జగమునెరుంగుట స్వప్నమేయా జగమునందు జరి
గెడిదంతా స్వప్నములో మనముంటిమి స్వప్నము కడద్రోయు
వారు సాధులుసుమతీ ॥౮౭॥ గనవచ్చెడు స్వప్నములో దనకెటిక
నువులకునిట్టి తనుగణములకు న్నణుమాత్ర మైనభేదము గనుపిం
చునె ధరణిలోన గాంచుముసుమతీ ॥౮౮॥ వినరాదేహము లేకల
గనరామేల్కొనిననిట్టి కలయేమీలే దనగాయచలత్వ మేస్థిమంర
రా పలుమాటలేల మహిలోసుమతీ ॥౮౯॥ ధరమూలము లేదని
గుర్తెరుగు శరీరాలుగనుక తీర్మానముగా స్థిరములుగావని దెలిసిన
పరిపూర్ణంబౌచునిల్వ బడురాసుమతీ ॥౯౦॥ ఇంతకుమిగిలినధర్మం
బెంతయు వెదికినను గాంచ రేలోకమునఁ బ్రాంతివిడనాడినీసు
స్వాంతమునఁ దెలిసిభువిని జలగుము సుమతీ ॥౯౧॥ ఇటువంటి
మేలుబాటకు భటువగుమాయకులు పాలుబడరని గనుమా కరు
ణ బడిదెడిశముననీ భటులకుచొక్కుచుచుదను పాపులనుసుమతీ

౯౨॥ కష్టమునబుట్టువానికి కష్టంబిదిసౌఖ్యమొకటి గలదనిజెప్పన్ ఇష్టపడడెంతమాత్రము స్వప్నంబనిదలచవలయు జగతిలో సుమతీ ౯౩॥ ఎండినమొద్దులమీదను పండందగు మానవుండు బహుసుఖకరమా దిండుదివాళీయుంచిన పండడుపండినను నిద్ర బట్టను సుమతీ ॥౯౪॥ పులసీళ్లుత్రాగువానికి ఇలలోపాలన్నమిడిన నిందదు మరియున్ బలవంతమునను దిన్నను నిలువక వెలుపలకిపచ్చు నిజముగ సుమతీ ॥౯౫॥ మొదలనువిషమై యగుబడు నదియాత్రముత మగుచుమించు ననిగనుముధరన్ మొదలను రుచిగానగుబడు నదియంతా విషమటంచ్రదు నమ్ముము సుమతీ ॥౯౬॥ మంచికిపాల్పడరు గదా ఎంచగ చెడుకొప్పినట్లు యీలోకములో చంచలనేత్రులపై మది యుంచినటుల దైవమందు నుంచరు సుమతీ ॥౯౭॥ తక్కిడిసంసారమునన్ చిక్కములో పిట్టరీతి జక్కుట మేలాచక్కనితోవగనుంగొని దుఃఖముదోయడము మేల దెల్పుము సుమతీ ॥౯౮॥ చక్కని దెరవిట్టిదనే దొక్కండై నాగణింప దుర్వినిగనుమా పెక్కువిధంబుల నడచుచు చిక్కులుబడుచుందురవని జనములు సుమతీ ॥ ౯౯॥ ధరవనవాసము జేతురు మరికొండబిలంబులందు మరిగివశింతురా విరగబడితప మొనర్తురు నగులకియా వెర్రి యేమినయమా సుమతీ ॥౧౦౦॥ వడలను దడుపుచునుందురు జడలుధరించుచురు చేత జపమాలికల న్నిడిద్రిప్పుచుందురవనిని మడిమయులనియెదర దేటి మహిమో సుమతీ ॥౧౦౧॥ బూడిదెబూతురుదలలును బోడిగజేయుదురు నామములుదీడెదరూ జూడగను కాయబట్టల గూడు చుగడ్డములు బెంచుకుందురు సుమతీ ॥౧౦౨॥ ఈలాటిభాటులెల్లను చాలాగలవీటుగాంచ జాలరుపరమున్ చాలున్ దెలియనివోకల వేలాసార్థకము లేదు వినరా సుమతీ ॥౧౦౩॥ యానర్వేశ్వరుదర్శనమే సార్థకమైనపదవి మేదినిలోనన్ వానవృషమురాళినహా శేసినదే

విట్టిధ్యాన శిద్ధము సుమతీ ॥౧౦౪॥ ఆమహదానందము నొందెమ హితునకును సమస్తదేవగణంబుల్ కామితఫలములొసంగుచు నే మారక వెంటనుందు రెప్పుడు సుమతీ ॥౧౦౫॥ యీలువలెనెప్పుడి వానికి నెటుజూచిన నెదురులేక నీశ్వరుకృపచే మాయమాయ జగ జ్జాలము లెటులైనను జూచుచుండు నెప్పుడునుసుమతీ ॥౧౦౬॥ జగ మున నెవడైతేనే మగణితమైనట్టినస్థ వందినవాడే దగుబ్రాహ్మణు డననలనినె భగవంతుడు మెచ్చుచుండు పతిమెను సుమతీ ॥౧౦౭॥ ఇ దినత్యం బిదినిత్యము ఇదిగాదని హేళనముగ నెవ్వండైనా పదిరిన టులైతె దైవము విధియించును నరకకూప విభవన్ సుమతీ ॥ ౧౦౮॥ ఈపద్యములందర్థము నాపేక్షతో పొందదగిన వగుడిలకుగు వ్రుగ చేపట్టకున్న వీడను శ్రీపతిసాక్షిగను యిదియుశిద్ధము సుమతీ ౧౦౯॥ అనియీవిధమున నాహనుమునిగిరి శివరామయోగి ప్రా ప్తానుభవం బునువినుపించినతత్వము గనివర్ణింపను ఫణీంద్రుడై న ను వశమా ॥౧౧౦॥ శ్రీకరిమొప్పెడిబ్రాహ్మణ బ్రాకపురిగ బ్రబ లు విశ్వబ్రహ్మకులుండౌ పోకూరు సుబ్బరాయుం డీకృతిరచియించెద నయభీష్టములొదవగ.

సుమతీపద్యములను-యచలమార్గము.

సమాప్తము.

## అష్టాంగయోగనిరూపణము.

ద్విజులంబులారా వినుండు యద్వితీయుండగు పరబ్రహ్మమునుద ర్శించువారలకు సాధనమును హనుమునిగిరి నివాసుండగు శివరా మబ్రహ్మేంద్ర గురుస్వాముల వారుపదేశించదలంచి ఇట్లనిరి. ప్ర ణవాకారంబగు విశ్వబ్రహ్మమువలన క్రిమికీటకక్రముగ పక్షిస్థావరజం గమాకారంబగు ప్రపంచంబుద్భవించె నట్టిప్రపంచంబును అందుగ

లసర్వజీవులను అంటియునంటకను బహిరాంతరంబుల ప్రకాశించు చుండు నమ్మహాదేవుని మానవకోటి దర్శింపజాలక పుట్టుకతోనే కామారణ్యంబునజిక్కి దరుగుపడనిఖర్గ లొనర్చుచు కాలాంతరంబా యమకింకరులచే కట్టుబడి దక్షిణదిక్పతిస్థానంబు ననున్న మహానరకంబులలో ద్రోయంబడియడ లేని దుఃఖమనుభవించి పునర్భవంబునన నంతనామరూపనీచయోని ద్వారంబులదగిలి పుట్టుచుందురింతియే గాక జన్మపరిహారమునుగూర్చి యొక్కరున్ను లెక్కించుట లేదుగా ననట్టిఖర్గ పరిహారార్థమునకు సద్గురుండేకర్త యట్లుగుంటంజేసి బ్రహ్మప్రాప్తికై యష్టాంగయోగము నభ్యసింపంజేసెద నెట్లనిన యమమనియు నియమమనియు యాసనమనియు ప్రాణాయామమనియు ప్రత్యాహారమనియు ధ్యానమనియు ధారణమనియు సమాధియనియు నెనిమిది విధంబులగునందుని యమమనగా విత్తాపహారులుగాక హృత్తాపహారుడగు గురువునుజేరి తారణమంత్రంబును తారక చైతన్యమును షణ్ముఖీ మొదలగు ముద్రలను దశవిధనాదంబులనుగాంచి మనశుద్ధిపరచుటే యమమునంబడు నియమమనగా పంచికరణాదులెరిగించి శుద్ధతత్వంబున నిలుపునట్టి సుగుణబోధలుంగల గురుస్థానంబువదలకుండుటేని యమము ఆసనమనగా అనేకవిధంబులగు ఆసనములుండు నవియన్నియు దొమ్మరులు అభ్యసించు విద్యలలో నొకభాగంబుగల సాధనలుగాననన్నిటని విడచితపోనియతానుకూలమగుసాధనమే యాసనమనందగు ప్రాణాయామమనగా ఇంద్రియాది సర్వతత్వవృత్తులను చిలింపనివ్వక మనస్సుకట్టి వాయువులస్థంభించినదే ప్రాణాయామము ప్రత్యాహారమనగా ఇష్టమగు పదార్థములలో వేళకులభించినమాత్రము బ్రహ్మార్పణగానమభవించినది ప్రత్యాహారము ధ్యానంబన నంతర్లక్ష్యమునగాని బహిర్లక్ష్యమునగాని గురుండుపదేశించు మహావస్తువే స

త్యంబని సర్వంబట్లుగాదలంచి మనోనిశ్చయుండై శరీరమునుమ రిచి యుండునదే ధ్యానమనంబడు. ధారణయనగా. స్థూలసూక్ష్మ కారణదేహంబులు తానుగాగ పరతత్వమే తానగుట ధారణము. సమాధియనగా. గీ॥ పంచభూతగుణంబులు పంచివేశి దేనియంశం బుదానికే తేటగాను ఇచ్చివేశిని వృత్తిగానిశ్చలేక నున్నవాడుస మాధియందున్నవాడు ॥ గావున సీ॥ పద్మాసనంబుపై ప్రాణముల్ బిగియించి మద్యలక్ష్యంబునే మరకనిగిడి ఇంద్రియవర్గాదివిషయ గోచరుగాక హంసలస్థంభించి ఆత్మదలచి ప్రాగుబ్ధభర్తలా పైగా నువదలించి బ్రహ్మసత్యంబని భావమంది మిధ్యాజగంబులో మిత్ర భేదముమాని విద్యలపైభ్రాంతి విడచిపెట్టి మాయగెలిచే యుపా యంబుమాననట్టి జీవుశివునైక్యభావంబు చేతబట్టి దేహముమరచి యాత్మస్వాధీనపెట్టి ఎంచగా నిట్టిముద్రాభ్యశించవలయు ॥వ॥ ఇ ట్లుఆచలగురుండగు శివరామబ్రహ్మేంద్ర గురుస్వాముల వారుపదే శించిన అష్టాంగయోగనిరూపణము.

సమాప్తము.

